# గౌతమ బుద్ధుఁడు

( ఏడంకముల నాటకము )

# ఏతద్గ్రంథ కర్తచే రచియింపఁబడిన గ్రంథములు

---

## 1. విప్రనారాయణ నాటకము (156 పుటలు)

ఇది సాంఘిక నాటకము. ఇందు విప్రనారాయణుఁడు దేవ దేవిని వివాహమాడును. వేశ్యావృత్తి నీచమనియు, గృహస్థ ధర్మము మోక్ష సంపాదక మనియు, మానవుఁడు స్వార్థమును మాని లోకసేవ చేయవలయు ననియు, మున్నగు పెక్కు నీతులను బోధించును. వెల రూ. 1-0-0

## 2. గౌతమ బుద్ధుఁడు (168 పుటలు)

ఇది యేడంకముల నాటకము. ఇది సిద్ధార్థుని యంతఃకరణ పరిణామమును వెల్లడి చేయుచు, అహింస, దయ, నీతి, వైరాగ్యము మున్నగు సార్వ గుణములను బోధించును. ఇందు శాంతరస మంగిగాను, హాస్యవీర శృంగారాది రసము లంగములుగాను నుండును. ఇత్యాది లలిత పద్యములతోడను, రసోచిత సంభాషణము తోడను, విరాజిల్లు చున్నది. వెల రూ. 1-0-0

## 3. కథామణి ప్రవాళ ముక్తావళి

## (ప్రథమ సంపుటము; 80 పుటలు)

ఇందలి కథలు చిన్నవై భిన్నాభిరుచులుగలవై నీతిప్రదములై యున్నవి. వీనిలోనివి కొన్ని భారతకథలు, కొన్ని సుప్రసిద్ధ విదేశీయ కథల కనువాదములునై యున్నవి. వెల రూ. 0-8-0

## 4. కథామణి ప్రవాళ ముక్తావళి

## (ద్వితీయ సంపుటము; 100 పుటలు)

ఇందు 'టాల్స్టాయ్' రచితమగు 'The Prisoner in the Cacusses' అను కథయొక్క యాంధ్రీకరణము, 'రస్కిన్' రచితమగు 'The King of the Golden River' అను కథ కనువాదమును గలవు. శైలిగంభీరముగ నున్నది. వెల రూ. 0-9-0

## 5. కథామణి ప్రవాళ ముక్తావళి
## (తృతీయ సంపుటము; 120 పుటలు)

ఇందు (1) పాండవుల యజ్ఞాతవాసము (2) జీమూత వాహనుఁడు, (3) స్వారోచిష మను సంభవము అను మూడు కథలున్నవి. మొదటి కథ పూర్వకాలపు సమర సంప్రదాయములను దెలుపును. రెండవది కరుణ రస ప్రధానమై మంచి నీతిని బోధించును. మూడవది సముచిత హృద్య పద్యములు గలిగి మనుచరిత్ర కథను రమ్యముగా తెలుపును. వెల రూ. 0-10-0

## 6. పరిణయ కథామంజరి (96 పుటలు)

ఇందు ఆదర్శ ప్రాయములగు పార్వతి, సీత, రుక్మిణి, ద్రౌపది, సుభద్ర—వీరి పరిణయ కథలు హృద్యముగాను, రసోచితముగాను చెప్పఁబడినవి. వెల రూ. 0-8-0

## 7. ఆంధ్ర వ్యాకరణదర్పణము Part I (60 పుటలు)

ఇది మిడిల్ స్కూలు విద్యార్థుల కుపయుక్తముగా వ్రాయఁబడినది.
వెల రూ. 0-5-6

## 8. ఆంధ్ర వ్యాకరణ దర్పణము Part II (56 పుటలు)

ఇది హైస్కూలు విద్యార్థులకొఱకు వ్రాయఁబడినది.
వెల రూ. 0-5-6

## 9. ఆంధ్ర వ్యాకరణ దర్పణము
## (First two parts in one Book 116 పుటలు)

ఇది 'మిడిల్ స్కూల్,' హైస్కూల్ 'ట్రేనింగ్ స్కూల్,' విద్యార్థులకు పనికి వచ్చును. ఇది వారిబోధనా ప్రణాళికల (Syllabus) ననుసరించి వ్రాయఁబడినది. వెల రూ. 0-9-0

పై వ్యాకరణ గ్రంథములు ఇంగ్లీషు వ్యాకరణ పద్ధతిని పెక్కు అభ్యాసములతో వ్రాయఁబడినవి.

వలయువారు:—

ఆంధ్ర విద్యార్థి ప్రచురణాలయము,
ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్ అండ్ బుక్ సెలర్స్, బళ్లారి.

శ్రీ రస్తు.

# గౌతమ బుద్ధుఁడు

(ఏడంకముల నాటకము)

గ్రంథకర్త:

రూపనగుడి - నారాయణరావు,

సహోపాధ్యాయుఁడు,

గవర్నమెంటు సెకండరి ట్రైనింగు స్కూలు,

బళ్లారి.

ప్రకాశకులు:

ఆంధ్ర విద్యార్థి ప్రచురణాలయము,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్,

పూల బజారు, బళ్లారి.



[వెల రూ. 1-0-0

# విజ్ఞప్తి

బుద్ధునికాలమున మానవమండలియందు హింస, అదయ, అవిశ్వాసము, అకర్మము, అవిచారశీలము, మున్నగు గుణంబులు వ్యాపించి, ధర్మగ్లాని యుండఁబట్టియే, బుద్ధ మహానుభావుఁడు ప్రపంచాభ్యుదయ మెంచి, శ్రమణసంఘ మేర్పఱచి, యందలి శ్రమణులచే విశ్వసౌభ్రాత్రతత్త్వమును నెల్లయెడల బోధచేయించెను; తానును విరామములేక చేసెను. ప్రస్తుతకాలమునందును, బుద్ధునికాలమందువలెనే, ధర్మగ్లాని ప్రపంచమునఁ జూపట్టుచున్నది; కావుననే బుద్ధుని బోని వ్యక్తి గాంధిమహాత్ముఁ డుదయమంది, యహింసాది తత్త్వములను లోకమునకు బోధించుట. ఇట్టి తఱిని బుద్ధుని యాంతరపరిణామమును, ఆతని యాత్మపరిత్యాగశీలమును, ఆతని ధర్మబోధములను, ఆతఁ డనుభవించిన కష్టములను, దెలుపు రూపకమును రచించి ప్రచురింపించుట యసమయంబుగా నుండదని యెంచి యట్లు చేసితిని.

ఈ కృతికి దివాన్ బహదూరు పప్పు సీతారామయ్య, యం. ఏ., గారు తొలిపలుకు వ్రాసినారు. వీరు చిత్తూరు మొదలగు మండలములందు జిల్లా 'కలెక్టరు' గాను, మద్రాను గవర్నమెంటు 'సెక్రిటరి', (Law & Education) గాను, పనిచేసి ప్రకృతము మద్రానునందు విశ్రాంతి గైకొనుచున్న వారు. వీరికి నే నపరిచితుఁడనయ్యు, నాకుఁ జిరపరిచితులును,

వారికిఁ బినసోదరులును నగు శ్రీయుత పి. యస్. రామశర్మ, బి. ఎ. యల్. టి., గారిగుండ, వ్రాఁతమూలముగ నేను శ్రీ వారిని వేఁడఁగా వారు సమ్మతించి, దీనికిఁ దొలిపలుకును వ్రాసి, నన్ను గౌరవించి సంతోష పఱచిరి. ఈ యుదారహృదయులకు, కృపాపరీతచిత్తులకు, నే నిందుమూలమున నా కృతజ్ఞతా పూర్వకమైనవందనముల సమర్పణము చేయువాఁడ.

ఈ గ్రంథమును రచించుటయందు నన్నుఁ బ్రోత్స హించిన నా మిత్రబృందమునకు, అందున ముఖ్యముగా, నాకు వలసినపుడెల్లఁ దగినసాయ మొసంగి నాచే దీనిని వ్రాయించిన నా చిరమిత్రులగు నేత్రపాల్లి సంజీవరావు, బి. ఎ., యల్. టీ. గారికి, నా యభివందనముల నర్పించుచున్నాను. మఱియు దీని ప్రచురణమునకుఁ గడంగిన 'మారుతీ గ్రంథమండలి' కార్యనిర్వాహకవర్గము వారికిని నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

బళ్లారి,
30-1-37

రూపనగుడి - నారాయణరావు,
గ్రంథకర్త.

# FOREWORD.

I cannot pretend to be a scholar. I can lay a valid claim to be one of the many who exercise the privilege of learning at the feet of the few who have the happy chance of serving through their authorship the larger group of earnest readers. The privilege of writing this preface has, I believe, fallen to my lot as the author has apparently chosen me - one unknown to him—as a type of the general readers who prefer to appreciate what is given with good will, without yielding to the strong temptation of revelling in captious criticism.

The subject of this 'Natakam' or Drama is Prince Siddhartha, the great man whose life-history as Goutama Buddha, has brightened and hallowed the religious history of Aryan India. His life on earth—like the lives of all great exemplars of humanity—represents the struggle, temptations and triumphs of the human soul in its quest of freedom from bondage. The fight between the sense and the soul is an ever-raging battle that must be fought by every incarnated spirit so long as the human soul by its very nature heroically strives to seek for and reach the source of True Happiness, be it called 'Nirvana', 'Ananda', 'Bliss', 'Mukti', or 'the Peace that passeth all understanding'. Buddha laid stress on a righteous life of selfless service with "Ahimsa", as the only key to spiritual freedom. He knew no distinction of classes or castes or

sexes in the strife of Salvation. He recognised no use in sacrifices, creeds, and doctrines as the means of acquisition of merit by man.

In language—sober, dignified and easily intelligible—the author has tried to present the main incidents of the life of the hero in a manner suited to evoke the appropriate feelings of the reader at home or the spectator, if the story should be set on a stage. The inborn tenderness of the Prince, who could not bear the sufferings even of a bird (swan) brought down by a huntsman's arrow, and who could not feel happy till he healed the bird's wound and set it free to roam through the region of air—its natural home, the anger and envious hate of his cousin Devadatta which began with Siddhartha's refusal to surrender the victim as the rightful prize of the hunter who had brought it down, the other-worldly spirit which threatened at the very outset of life to destroy the King's (Father's) ambitious hope of making his son an earthly king, the worldly-wise scheme of marriage to secure the Prince's attachment to the pleasures of earth, the futile arrangements to keep from the Prince's knowledge all sights of human sin, sorrow, suffering, the wreck of old age and the end in death, as if there was only one side of life which is all pleasure and no pain, the powerful call of Truth that drove the inborn spirit of the Man to break through the earthly bonds that in vain darkened his understanding and cramped the freedom of his soul for a time, the keen personal agony through which the Man had to pass before he

finally decided to part from his wife and child when they were lost in sleep, and to go forward with a will to discover the secret of human sufferings for the benefit of all the world of men longing but unable to be free, the vengeful pursuit by the disappointed lover—Devadatta—of the Prince who had unconsciously made an inveterate enemy of his cousin by his own good fortune in securing the love of noble Yasodhara in preference to all other suitors, the extreme physical privations resulting from a course of severe meditation (yoga) that nearly brought him to death's door till he was saved by the offerings of a devoted woman through whose apparent superstition real humanity made itself felt at a grave crisis, the final triumph over all the selfish desires of the mind and the opening of the eye of spiritual vision which found Love to be the seed of all Life, the characteristic rejection by the great sage of the goal of self-liberation under the prompting of the sense of supreme Duty that makes the great souls live with the one purpose of enlightening the unenlightened and helping them to rise to greater heights of righteous living, the all-round detachment of the spirit and transparent all-embracing love of the man whose courage crushed into repentance the abandoned bandit leader, the deserting disloyal pupils, the evil-natured cousin who felt no ruth till the moment of his last surrender to the invincible power of righteousness—these are but a few of the character sketches that grip the mind of the reader right through to the close.

Chenna the faithful, loving, personal, servant; the reckless bandit Angulimala with his song of the Triumph of Drink; the Cannibal Ilvala with his panegyric on the belly, these two reprobates who had without any compunction agreed to murder the saintly Buddha merely to please king Ajātasatru, a tool in the hands of Devadatta, his evil genious, who cloaked his personal malice under the love of true religion by denouncing the Teacher as a false preacher and an enemy of true faith: the outraged orthodox couple Lilavati and Kuvinda who lamented over the growth of the new religion thereby indicating the shock of horror felt by orthodox brahminism with its path of ceremonies and sacrifices leading to salvation; the simple and reverent though illiterate Harijātha—the type of the neglected social class—who with a moment's effort gave up his habit of incessant smoking by discovering his own strength of mind in response to the encouraging words of the wise teacher who declared that man alone is the only maker of his character and moulder of his destiny and not anything else either on earth or heaven; the hard-hearted disciples who abandoned to his fate their trustful teacher in his lonely helplessness after starvation merely because their orthodoxy had been outraged by the Kshatriya taking rice and milk from Sujāta, a Golla (Shepherd) woman, who saved him from death; the humanity of the woman Sujāta that saved the man of penance through her mistaking the god-like face for the spirit of the tree that had taken on flesh and

blood in response to her prayers, thus showing that even superstition can feel sympathy and render unselfish service to those in need ;—these types portrayed in the story of this Man of Destiny are always true to human nature, irrespective of the times, whether ancient or modern.

I have been disposed to dwell on the author's characterization of the various actors in the drama leaving the task of criticism, if any, of the language, style, and dramatic situations to others who may be more inclined to devote their attention to those aspects of the work. I have only one word more to add. The "Bharata Vakyam" is an universal prayer and an eternal Truth It is a fitting conclusion to the drama. As an epilogue it embodies the hopes and aspirations of all peoples in all ages and in all climes whenever and wherever the self-glorying pride of man has not dared to pull down from His Throne the One in whom we live and move and have our being.

May the readers find profit and pleasure, and the author earn the reward of their grateful appreciation of his modest work ! !

THYAGAROYANAGAR,
MADRAS,
*26th January '37.*

P. SITARAMAYYA, M.A.,
*Secretary to Government,*
*(Law and Education),*
*Retired.*

# అంకితము

సీ. పురుటింటనే తల్లి పోవఁగఁ దనయవ్వ
హనుమాంబచే నేఁడు పెనుపఁబడియె;
తడవుకోఁ దగిన విద్యాశిక్ష లేకున్నఁ
బటుబుద్ధి యెవ్వని పాలనుండె;
ఉద్యోగపదవి యేఁడొందియున్నను దాని
దుర్ వ్యయమున కెప్డుఁ దొడరకుండె;
సజ్జనావళిపైన సత్కృపాసారంబు
గురియింప నెవ్వఁడు కోరుచుండె;
గృహనీతివిద్య మద్గృహమున నెవ్వాని
ప్రేమమార్గప్రవృత్తులఁ బెంపుగాంచె;
విద్యావినయ సముపేతులఁ గావించి
మమ్ము బిడ్డల నేఁడు నెమ్మిఁ బ్రోచె!

గీ. అట్టి పుణ్యమూర్తికి సత్కృపాంబు నిధికి
ధర్మమార్గానువర్తి కుదారమతికి
దివమున వసించు మత్ పితృదేవమణికిఁ
గృతిసమర్పణ మొనరింతు నతులభక్తి.

# ఈ నాటకమున వచ్చు పాత్రములు.

## పురుష పాత్రములు.

సిద్ధార్థుఁడు—శుద్ధోదనుని కొడుకు, కథా నాయకుఁడు.
బుద్ధుఁడు—సిద్ధార్థుఁడు బుద్ధత్వ మందిన పిదప వచ్చిన పేరు.
శుద్ధోదనుఁడు—సిద్ధార్థుని తండ్రి, కపిలవస్తు పురాధీశుఁడు.
మంత్రి—శుద్ధోదనుని మంత్రి.
విశ్వామిత్రుఁడు—సిద్ధార్థుని విద్యాగురువు.
దేవదత్తుఁడు—సిద్ధార్థుని పినతండ్రి పుత్రుఁడు, బుద్ధుని విరోధి.
యోగి—హంస విషయమై సిద్ధార్థ దేవదత్తులకుఁ గలిగిన తగవును దీర్చిన యతఁడు.
వసుకాముఁడు—శుద్ధోదనుని సేవకులలో నొకఁడు.
చెన్నుఁడు—సిద్ధార్థుని సారథి.
కౌండిన్యుఁడు—బుద్ధుని శిష్యుఁడు, శ్రమణుఁడు.

| | | |
|---|---|---|
| మహానాముఁడు | ,, | ,, |
| భద్రకుఁడు | ,, | ,, |
| బసవుఁడు | ,, | ,, |
| అశ్వజిత్తు | ,, | ,, |
| శారిపుత్రుఁడు | ,, | ,, |
| మొగ్గలానుఁడు | ,, | ,, |

కువిందుఁడు—రాజగృహ పౌరుఁడు.
సిద్దఁడు—దానమతి యను గ్రామమందు వసించు చాకలవాఁడు.
అజాతశత్రుఁడు—దేవదత్తుని మిత్రుఁడు. దేవదత్తుని ప్రేరణమునఁ దన తండ్రి యగు బింబిసార మహీపాలుని చెఱసాలయం దుంచి, మగధరాజ్యము నేలిన రాజు.

మధుకరుఁడు—అజాతశత్రుని ముఖ్య చారుఁడు.

అంగుళీమాలుఁడు—బుద్ధుని జంప నుద్యమించిన చోర నాయకుఁడు.

ఇల్వలుఁడు—అంగుళీమాలుని యనుచరుఁడు.

హరిజాతుఁడు—అడవిని దారిచూప బుద్ధుని వెంట వచ్చిన మాలవాఁడు.

భరద్వాజుఁడు—బిచ్చము పెట్టక బుద్ధునితో వాదులాడిన గృహస్థుఁడు.

## స్త్రీ పాత్రములు.

యశోధర—సిద్ధార్థుని భార్య. కథా నాయిక.

గౌతమి—శుద్ధోదనుని రెండవ భార్య. సిద్ధార్థుని సవతితల్లి.

ఇందిర—యశోధర చెలికత్తె.

చంద్రిక— ,, ,,

చిత్ర—చేటి.

సుజాత—సిద్ధార్థునకుఁ బాయస మిడిన గొల్ల యిల్లాలు.

రాధ—సుజాత చెలికత్తె.

లీలావతి—కువిందుని భార్య.

వీరుగాక భటులు, భట నాయకుఁడు, ప్రతీహారుఁడు, మావంతుఁడు, జాంఘికుఁడు, కుంటి, ముసలి, పౌరులు, వర్తకు.

స్థలములు—కపిలవస్తు పురము, కోలీపురము, రాజగృహము, ఉరుబిల్వాద్యరణ్య ప్రదేశములు, కాశి సమీప మండలి కురంగారామము.

---

శ్రీరస్తు

# గౌతమ బుద్ధుఁడు

(నాంది)

సీ. స్వాంత మేరిది పారిక్ శాంతరసం బంటి
నిద్దంపు టద్దమై నివ్వటిలఁగ,
నైహిక సుఖదుఃఖ వ్యవహార మఖిలంబు
దర్పణంబున బింబితంబు నయ్యెఁ,
దత్ ప్రతిబింబముల్ తద్దర్పణంబున
నిలువక తోడ్తోనఁ గడచి చనఁగ,
నమ్ముకురంబు స్వచ్ఛమ్మయి మాలిన్య
మింతేని హత్తమి నెసఁగుచుండఁ,

గీ. బోటుమాటలు నింగ లే ముకురమునకుఁ
జికిలి చేసెడి బూదియై చెన్నుగూర్చు;
నట్టి బుద్ధుని శుద్ధాంతరంగదర్ప
ణం బొసఁగుఁ గాతఁ దత్త్వ సందర్శనంబు.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.)

సూత్రధారుఁడు—— నటీ ! ప్రేయసీ !

నటి——(ప్రవేశించి) ఆర్యా ! ఏమియాజ్ఞ?

సూత్రధారుఁడు—— విప్రనారాయణ నాటకకర్త యగు రూపనగుడి నారాయణరావు నూతనముగ గౌతమ బుద్ధుఁ

డను రూపకమును రచించి యున్నాఁడు. దానిని ప్రదర్శింప నెంచినాఁడను. నీ యభిప్రాయము వినఁగోరెదను.

నటి—గౌతమ బుద్ధుని తత్త్వబోధములు నాస్తికతా బుద్ధిని నాపాదించి యాత్మను బెడత్రోవయందు నడపును గదా. అట్టి నాటక మాడనేల ?

సూత్రధారుఁడు—బుద్ధుఁడు నిరీశ్వరవాది యని నీ యభిప్రాయము కాఁబోలు.

నటి—అవును.

సూత్రధారుఁడు—బుద్ధుఁడు దైవసద్భావమును నిరాకరింపలేదు సుమా.

నటి—అయిన నంగీకరించెనా ?

సూత్రధారుఁడు— అంగీకరింపను లేదు. అవ్యక్తము వ్యక్తము-ఈ రెండును ఆత్మకు నవగతము లైనప్పుడే సత్య తత్త్వ సందర్శనము- మోక్షము గలుగునని విజ్ఞానఘనులు నుడువుదురు. మహాపరినిర్వాణమును సత్వరమ పొందనున్న బుద్ధునియాత్మ, నాస్తికతాస్తికత లనెడి యవస్థాద్వయమునకు నడుమ నుంటచే, అతఁడు దేవుఁ డున్నాఁడనికాని లేఁడనికాని నొక్కి చెప్పలేకపోయెను. అంతమాత్రమున బుద్ధమతము నాస్తికమతమని చెప్పనగునా ? అదికాక, బుద్ధుఁడు అహింస, దయ, నీతి, వైరాగ్యము, మొదలగు నార్యమార్గములనే త్రికరణ శుద్ధిగా ననువర్తించుచుఁ దన్మార్గానువర్తనము వలననే మానవునకు నిర్వాణప్రాప్తికలుగు నని బోధించు వాఁడు. అట్లగుట బుద్ధమతమునకును, ఆర్షమతమునకును, భేదమొంతేని లేక, సాధర్మ్యము లనేకము లున్నవి. ఇట్టియార్ష

మత ధర్మములను బోధించి, యాత్మవికాస మొడఁగూర్చు గౌతమబుద్ధనాటక మాడుటవలనఁ గీడెట్లుగలుగును ? మేలే కలుగును.

నటి—ఆర్యా! మీ మాటలవలన నా చిత్తము నిష్కళంకమాయెను. ఈ గౌతమబుద్ధనాటకమునే ప్రదర్శింతము. ... ... ఇపుడు నేఁ జేయవలసిన కార్యమెద్ది ?

సూత్రధారుఁడు—నేపథ్యరచనకు వలయు పరికరములన్నియు నేకరింపఁబడినవి. నేను సిద్ధార్థుని వేషము వేసికొందును గావున, మన నటీనటకులందఱు వారివారి పాత్రముల కనువగురీతి వేషములను ధరించునట్లు నీవు చేయుము. ఈ పని నీకుఁ గష్టమైనదా ?

నటి— ఇది యేమి కష్టము ?

తే. మీరు నియమించు కార్యంబు మీకు మెప్పు
గలుగ నవలీలఁజేసి నే మెలఁగ లేనె ?
మీరు మా యొజ్జలై, శాక్య వీరపుత్ర
గురువరుఁడగు విశ్వామిత్రు కరణినుండ.

(నిష్క్రమించుచున్నారు.)

—

శ్రీ ర స్తు

# గౌ త మ బు ద్ధుఁ డు

---

ప్రథమాంకము

రంగము 1. కపిలవస్తు పురమందలి రాచనగరు.

(శుద్ధోదనుఁడు, మంత్రి, విశ్వామిత్రాచార్యుఁడు, సముచితాసీనులై యుందురు.)

**విశ్వామిత్రుఁడు**—శుద్ధోదన మహీపాలా! సిద్ధార్థ కుమారుఁడు మనీషావంతుఁడు; కావుననే యాతఁ డింత సత్వరము విద్యావైదుష్యముం బడయఁగల్గుట.

**శుద్ధోదనుఁడు**— సిద్ధార్థుఁడు సకల విద్యాస్నాతకుం డగుట కేవల మాతని బుద్ధినైశిత్యమువలననే గాదు; గురువుగారి బోధన వైదగ్ధ్యముం బట్టి కూడ నున్నది.

**మంత్రి**—అంతేవాసుల మనస్స్థితిగతులెఱింగి, వారి చిత్తములను సముచిత నిజబోధనచే నలరేపి, వారిని నుత్సాహవంతులఁగను, జిజ్ఞాసువులఁగను, స్వయంబోధకులఁగను, నొనరించి, వారికి ధర్మార్థకామమోక్షము లను చతుర్విధ పురుషార్థసంపాదనమునం దాసక్తిని గలిగించి, వారి శ్రేయోభివృద్ధిని గోరు కృపామూర్తియగు పండితవర్యుఁడే నిజమైన యొజ్జ. అట్టివారు మన...

శుద్ధోదనుఁడు—మనయాచార్యులవా రట్టియొజ్జ యనుటకు, అనతికాలముననే సిద్ధార్థుఁడు సకలవిద్యావిశారదుఁడును, వినయసముపేతుఁడును, నగుటయే ప్రబల నిదర్శనము.

విశ్వామిత్రుఁడు—మీ విశ్వాసమును, మెప్పును, నేఁబడయఁగలుగుటకుఁ బ్రజ్ఞావంతుఁడును, సహజ జిజ్ఞాసువును, గురుభక్తి తత్పరుండును, నైన సిద్ధార్థుఁడె ముఖ్యకారణమని నేను మరల నొక్కి చెప్పుచున్నాను.

తే. గాలికిని బోవు సుమపరాగంబు పుష్ప
పాత్రమును జేరి ఫలమైన భాతి, భువిని
శ్రేష్ఠ పాత్రంబునం బడు శిక్షకుని సు
విద్య గుణ విశేషతఁ జెంది వెలయు మిగుల.

రాజేంద్రా! ఇక్కడ నే నుండి చేయవలసినకార్యము లైనవి. హిమవన్నగప్రాంతమునకుఁ బోయి, తపస్సుచేయ సంకల్పించినాఁడను. నా యీ సంకల్పమును, అధ్యయన శాలయందలి మచ్ఛాత్రబృందమునకుఁ దెలిపి, వారి నాశీర్వదించి, మీ యనుజ్ఞ గైకొని పోవ నిటకు వచ్చినాఁడను.

మంత్రి—స్వామీ! మీ రిట్టి మహత్తరమగు సంకల్పముచేసి, మమ్ముల నింత శీఘ్రముగ విడిచిపోవుదు రని యెఱుంగము.

శుద్ధోదనుఁడు—ఆచార్యశేఖరా! విజ్ఞులరగు మీకు మే మేమని చెప్పఁగలవారము. మీ యుపకార మెట్లు తీర్చుకోఁగలవారమో యెఱుఁగము.

విశ్వామిత్రుఁడు— రాజశేఖరా! అమాత్యవరా! సిద్ధార్థుని విషయమై మీ కొకహితము చెప్పువాఁడను. అతని

హృదయము నవనీతకోమలము. వృద్ధుఁడుగాని, రోగిగాని, శవముగాని, సన్న్యాసిగాని, వికలాంగుఁడుగాని, యతని దృష్టిని బడకుండఁ జూచికొనవలెను. అట్టివా రెవ్వరేని యాతని కంటఁబడిరా, నాఁటి కనతికాలముననే యతఁడు పరిత్యక్తరాజ్యుఁడై, సర్వసంగపరిత్యాగియై, పోవును. ఇంత వఱ కాతని మిక్కిలి జాగరూకతతోఁ జూచికొంటిని. ఇంక మీఁదట మీరును నతని నట్టులే చూచికోవలెను.

శుద్ధోదనుఁడు—ఆచార్యతిలకా! నా కుమారుఁడు విరాగి కాకుండ నుండు నుపాయమును దెలిపి, నాకు నంతాన భిక్షగావించితిరి. మీనుడివినట్టి పురుషు లెన్నటికిని వానికంటఁ బడకుండఁ దగినవ్యవస్థలు చేసెదము.

విశ్వామిత్రుఁడు—మంచిది. పోయివచ్చెద.

శుద్ధోదనుఁడు, మంత్రి—(లేచి వంగి నమస్కరింతురు)

విశ్వామిత్రుఁడు-శుభమగుఁగాక. (నిష్క్రమించును)

శుద్ధోదనుఁడు—మంత్రివరా! ఆచార్యశేఖరుని పలుకులు వింటివిగదా. మూఁడు ఋతువులకుఁ దగినట్లు విశాలారామమధ్యమున మూఁడు సుందరమందిరంబులను సత్వరము కట్టించుము. అందు దుఃఖమేమాత్రముఁ జొరకుండఁ జూడుము.

మంత్రి—చిత్తము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

రంగము 2. కపిలవస్తుపురము. ఉపవనము.

(సిద్ధార్థుఁడు పద్మాసనస్థుఁడై యాకసము వంకఁజూచుచుండును.)

సిద్ధార్థుఁడు—ఆహా! ఈ ప్రాతరారంభవేళ శ్రేణులుగట్టి పఱతెంచుచున్న యీ హంసావళి యెంత రమణీయముగ నున్నది!

సీ. తొలిసంజచెల్వ క్రొమ్మోడయందుఁ దఱుగొత్తు
నాణిముత్యపుఁ జారుహార మనఁగఁ,
గమలాప్తుఁ డూరేగఁగా ముందుఁ గొఱలాడు
ప్రవిమలతోరణ పంక్తు లనఁగఁ,
బ్రభుపర్య ధర్మసంవ్యాప్తి పేర్మికి నింగిఁ
గడలొత్తు సితకీర్తి ఘనము లనఁగ,
స్వర్గవాహిని సురలో వాహ్యాళి వెడలిన
తెలితెరచాఁపల తెప్పలనఁగ,
గీ. వలయమై, కడు నిడుదలై, దళము గల్గి,
పంక్తులను సాఁగురచనలఁ బరిఢవిల్లి,
యభ్రపథమునఁ జనుదెంచు హంసతతులు,
నేత్రపర్వంబు గావించుఁ జిత్రగతుల.

ఈ శకుంతంబులు హిమవత్పర్వతమందలి తమ వాసస్థలంబగు మానస సరోవరంబున కరుగుచున్నవి కాఁబోలు. ఏమి వీనిజవము! ఎంతో దవ్వులనుండునవి నిమిషమాత్రంబున గగనమధ్యంబునకుం జనుదెంచె? ఈ మరాళంబుల కలస్వనంబు లెంత మనోహరములుగ నున్నవి!

ఇప్పు డేలొకో తమ వక్రయానముం గనఁబఱచుచున్నవి! ఈ హంసరాజ మేల యిట్లు క్రిందికి దిగుచున్నది! కాదు,

పడుచున్నది ! ఈ రక్తబిందువు లేమి ! (తన యొడలిపైఁ బడిన రక్తబిందువులను జూచికొనుచుండఁగాఁ బక్షపుటమున బాణము గ్రుచ్చుకొన్న హంస తనముంగల నేలపైఁ బడును. వెంటనే దాని నెత్తుకొని దువ్వుచు) అయ్యో ! ఏ ఘాతుకుఁడు నిన్నీ క్రూరబాణమున నొవ్వనేసి, నీ విలసితవిశాల ధవళపక్షముల రక్తమలిన మొనర్చె ? ఓ మరాళరాజమా ! ఏల యూరక రెక్కల గిలగిల కొట్టుకొనుచు మఱింతబాధ గల్గించుకొనుచున్నావు ? నీవు శత్రుహస్తంబున లేక మిత్రహస్తంబున నున్నావునుమా. భయార్తవు కావలదు. హృదయోద్వేగము మానుమా. నీ పక్షపుటాంతరమందు నాఁటిన బాణ ముత్పాటించి గాయముల మాన్పి నీ పదువుఁ జేరవిడిచెదను. ... అయ్యో ! బాణము రెక్కలోఁగాఁడి దుస్సియున్న దే ! (బాణమును బుచ్చి) అయ్యో ! ఎంతరక్త మెంతరక్తము ! ఈ రక్తముంజూడ నా హృదయమునుండియె రక్తము స్రవించున ట్లున్న దే ! (ఆయంప మొనతోఁ దనముంజేతి నించుక గ్రుచ్చుకొని సీత్కారమున బాధ యభినయించుచు) దీని మొన యించుక సోఁకినంత నే నా కెంతో బాధగనుండ, ఇది యెంతయు నాఁటిన దీని కెంతబాధయున్నదో గదా ! వనౌషధీరసమును గాయములకుఁ బూసి, చల్లని పువ్వులను జిగురాకులనుగొని వానికొత్తి, బాధను శమింపఁ జేసెదఁగాక. (చెట్ల చాటునకు నడిచి యట్లు చేయుచుండును.)

దేవదత్తుఁడు—(ప్రవేశించి) నాయేటు దిన్న పక్షి యీ సమీపముననే పడియుండవలెను. ఈ చోటు రక్తార్ద్రమై

యున్నది! ఇంతలో దీని నెవఁడు దీసికొనిపోయి యుండును! అదిగో! సిద్ధార్థుఁ డందున్నవాఁడు. వాఁడే పక్షిని గైకొన్న వాఁడు. (పరిక్రమించి) ఓ సిద్ధార్థా! ఆ పక్షిని నే నేసితిని. అది నాది. దాని నిటు దెమ్ము.

సిద్ధార్థుఁడు—విగతాసువై యుండుపక్షమున, విహంగము తత్ధ్వంసకునిదే యయియుండును. కాని, యిది సజీవముగ నున్నది. వేఁటకాఁడు దానిపక్షబలమును వేగమును నశింపఁజేసినవాఁడు. అంతయే.

దేవదత్తుఁడు—ఈ యడవిపక్షి యాకాశమున నున్నంతదనుక నెవ్వరిదిగాదు. ఇప్పు డది బ్రదికియుండనీ, చచ్చియుండనీ, దానిం గ్రిందికిఁ దెచ్చినవాఁ డెవ్వఁడో వానిదే యగును. కావున, సిద్ధార్థా! నా పక్షిని నా కిచ్చివేయుము.

సిద్ధార్థుఁడు—(హంసకంఠమును దన చెక్కిలి కొత్తుకొనుచు) సోదరా! ఈ పక్షి నాయది. అట్లు నుడువ నా యంతరంగ ముద్బోధించుచున్నది. దీనికి నే శరణ మొసంగితిని. దయార్ద్రచిత్తమున నీవును నాలోచించి చూచితివేని, ఈ పక్షి నాదియే యని నీకును దోఁచకమానదు. నీ కప్పుడును సందేహము గలుగుపక్షమున ఈ విషయము విజ్ఞులకెఱిఁగించి వారి న్యాయవిమర్శనముం గైకొందము.

(యోగి దూరమునఁ బ్రవేశించును.)

దేవదత్తుఁడు— అల్లదే! యోగీశ్వరుం డా దారిని బోవుచున్నాఁడు. ఆతని నడుగుదము.

సిద్ధార్థుఁడు—(యోగి కెదురు చని నమస్కరించి) ఓ మునీంద్రా! కృపాసాంద్రా! మేఘోదయములేని వర్షంబు

చండంబున నిట కేతెంచితిరి. మీకుఁ గార్యాంతరభంగము వాటిల్లకున్న దయచేసి యిటు నిల్చి మా తగవు దీర్చిపొండు.

యోగి—కుమారులారా! మీ తగవేమి?

దేవదత్తుఁడు—అయ్యా! ఆకాశమార్గమున హంసలు పోవుచుండెను. అమ్మొరిఁగూసి నే నొకదాని నేసితిని. అది నేలఁబడె. దాని నాతఁడు గైకొన్నవాఁడు. అది తన దని యతఁడు నుడువుచున్నాఁడు; నా దని నేను నుడువుచున్నాను. అది యెవరి దగునో సెలవిచ్చెదరుగాక.

యోగి—ఈతని యొద్దనుండు సజీవమగు హంసమే కదా మీ తగవునకుఁ గారణము?

సిద్ధార్థుఁడు—స్వామీ! అవు నియ్యదియె. గాయముల మాన్పి దీనిని విడువనున్నాను.

యోగి—మంచిది; వినుఁడు.

ఉ. ప్రాణ మమూల్యమై యొనఁగు వస్తువు; దానిని బోలునట్టి దీ
క్షోణి తలంబునం దెదియుఁ జూడఁగ లేదు; దయార్ద్రచిత్తతన్
బ్రాణుల యార్తి మాన్పునతఁ డయ్యెడు లోక హితైక కారి; తత్
ప్రాణ విఘాతుకుండగుఁ బ్రపంచ వినాశకరుండు గూళయున్.

కాఁబట్టి యీ పక్షి తత్ప్రాణ రక్షకునిదే యగును గాని తత్ ధ్వంసకునిది కాదు.

సిద్ధార్థుఁడు—బాగు! బాగు! యోగివరా! ఈ విమర్శన మెంత న్యాయ సమ్మతము!

(యోగి యంతర్థాన మగుచున్నాఁడు.)

దేవదత్తుఁడు—(కోపముతో) సిద్ధార్థా! ఈ పక్షి నీదే యగును గాక; నే నితర పక్షులను వధించి తెచ్చికొందును లే.

(తనలో) నన్నవమానించిన వీనిమీఁది కసి నేను దీర్చికొన కుందునా ? (నిష్క్రమించు చున్నాఁడు.)

సిద్ధార్థుఁడు—ఈ పాపవర్తనము మాన్పించి, భూత దయా మహిమ మీతనికి బోధింపఁజాలకుందునా ? ఈవిశాల ప్రపంచమున దేవదత్తునిబోలువార లెందఱుందురో కదా. భూతదయా మాహాత్మ్యమును బోధించి యీ ప్రపంచమును లేశమైన నుద్ధరింప నేరకున్న నా యీ జన్మమేల ? ఈశ్వరా ! మదీయ ప్రయత్నమునకుఁ దోడ్పడుము.

(పరికించి చూచి) ముని సార్వభౌమా ! ముని సార్వ భౌమా ! ఆహా ! ఈతఁ డెందుఁబోయె ! ధరం గా ల్గ్లానక క్రీళ్లుఱుకుచుఁ బోవు కురంగ మటఁ గాన్పించుచున్నది. ఏమి దాని యుద్యద్గతి ! ఏమి దాని రూప విలసనము ! (దానినే చూచుచు నిష్క్రమించును.)

---

రంగము 3. కపిలవస్తు పురమందలి రాచనగరు.

(శుద్ధోదనుఁడు మంత్రియు నుచితాసనములఁ గూర్చుండి యుందురు.)

శుద్ధోదనుఁడు—అమాత్యవరా ! సిద్ధార్థుఁడు ప్రొద్దున నుండియు మందిరమున లేఁడు.

మంత్రి—ఏకాంతవాస రతుండగు నతఁడు గృహమున లేకున్న విశ్రామవనంబున నుండును.

శుద్ధోదనుఁడు—వసుకామా! (వసుకాముఁడు ప్రవేశించును.) సిద్ధార్థుఁడు విశ్రామవనంబున నుండును. అతఁడక్కడ నేమి చేయుచున్నాఁడో కనుఁగొని రమ్ము.

వసుకాముఁడు—మహాప్రసాదము. (నిష్క్రమించును.)

శుద్ధోదనుఁడు—మంత్రిసత్తమా! సిద్ధార్థుఁడు నానా పరిపంథి భూనాథ మకుట ఘటిత రత్న నికర ప్రభారాజి నీరాజమాన చరణ నీరేరుహుండై, జలధి పరీతాఖండ మహీమండలముల నేలు చక్రేశ్వరుండైనఁ గావలయు; లేదా, యనన్య సామాన్య వైరాగ్యమార్గ మనువర్తించి, పరిత్యక్త మందిరుండై భువనపవిత్రీకరణ లోకోత్తర ధర్మ మార్గైక బోధకుండైనఁ గావలయు, నని కదా పురోహితులు, జ్యోతిషికులు, పురుటింటిలోఁ జెప్పిరి. వీని జాడ యిట్లున్నదే!

తే. అభిలషింపఁడు రమ్యపదార్థ చయము;
అన్న మొల్లక దినములె యధివసించు;
ఎపుడుఁ జింతనాసక్తుఁడై యుపవనోర్వి
దివ్య బోధామృతముఁ గ్రోలఁ దివురుచుండు.

వీనిచిత్తము రెండవమార్గమందే నడుచునట్లున్నది.

మంత్రి—రాజేంద్రా! విశ్వామిత్రాచార్య వచనానుసారముగ జరారుజార్తులు, మృతులు, రాకొమరుని కంటఁ బడకుండఁ జేసినారము గదా. ఇంక భయపడనేల?

శుద్ధోదనుఁడు—సిద్ధార్థుఁడు సంప్రాప్త యౌవనుఁడు; మన నిర్బంధములకు లోఁబడియుండునా? లోకమును జూడవలెనన్న నెట్లు?

మంత్రి—రాజచంద్రమా ! సంసారమున కాతని దృఢముగ బంధించు పదార్థ మొక్కటి యున్నదిగదా.

శుద్ధోదనుఁడు—తరుణీమణి యందువా ?

మంత్రి—అవును. తరుణీమణియె.

సీ. ఏవారి సురుచిర లావణ్య సరసిలో
యువకుని మదిమొప్ప డోలలాడు;
ఏరి పరీరంభ చారు పంజరమున
యౌవనస్థుఁడు చిక్కి యవలరాఁడు;
ఎవరి షట్పదముల జవ్వరు పెన్నెఱి కురుల్
పాశబంధము లౌచుఁ బరిఢవిల్లు;
ఎవ్వారి భ్రూముక్త దృక్శిలీముఖపంక్తి
యువహృద్విభేదనం బొనరఁ జేయు;
తే. అట్టి చంద్రాస్య శంపాలతాంగి నొకతెఁ
బరిణయము చేసి తగులంబు పదిల పఱచి
పో విడిచినను వతఁడెందుఁ బోవఁ గలఁడు !
తరుణి కంటెను వేఱె బంధంబు గలదె !

శుద్ధోదనుఁడు—అట్లుచేయుట మంచిదే; కాని సిద్ధార్థుఁడు పరిణయమునకు సమ్మతించునా ?

మంత్రి—అతఁడు సమ్మతించుటేమి ? ఒక మహోత్సవ కారణమున లోకోత్తర రూపబృందముల రప్పించి, వారి కొక్కొకతెకు యువరాజుచేఁ గానుక లిప్పించునెడల, ఆతని మోహావలోకము లొక్కతెమీఁద నైనఁ బ్రసరింపకుండునా?

శుద్ధోదనుఁడు—అట్లేచేయుదము. నేఁటి కాఱవ దినంబున మన శాక్యమహోత్సవంబు జరుగును గదా. ఆ నాఁడే

రాజకన్యామణులందఱు సిద్ధార్థుఁ డొసంగు కానుకలఁ బరిగ్రహించుటకై వచ్చునట్లు వారి జనకులకు లేఖలను వ్రాసిపంపుము. మఱియు నీ వా దానకాలమున, అక్కడనె యుండి సిద్ధార్థుని చిత్తవృత్తులఁ బరిశీలింపుము.

మంత్రి-రాజేంద్రా! భవదీయాజ్ఞాముద్ర చేపట్టువాఁడ.

వసుకాముఁడు—(ప్రవేశించి) రాజేంద్రా! యువరాజుగారు విశ్రామవనంబుననే జంబూవృక్షంబు నీడఁ జింతాపారవశ్యమున నున్నారు. నే నొక మహాద్భుతంబు నటఁ జూడఁగల్గితిని. అపరాహ్ణ మగుట చెట్లనీడలన్నియుఁ దూర్పునకుఁ దిరిగియుండ, జంబూవృక్షంబునీడ మాత్రము పడమటిదిక్కునకే చాఁగియుండి యువరాజుగారి కెండ సోఁకకుండఁ జేయుచుండెను.

మంత్రి—రాజతిలకా! ఇది మహాశ్చర్యము; చూడఁదగిన దృశ్యము.

శుద్ధోదనుఁడు—విశ్రామ వనంబునకుఁ బోవుదము.

(లేచి నడతురు)

వసుకాముఁడు—ఇటు; ఇటు.

శుద్ధోదనుఁడు—ప్రకృతియె పక్షాంతరమునకుఁ దోడ్పడున ట్లున్నదే!

తే. ప్రకృతిచే సమాదృతుఁ డౌటఁ బ్రమదము, మఱి
త్యక్త గృహుఁడయి పోవునో యను విచార
మావరించుట నామనం బటమటించు
వానయును నెండయును దాఁకు వనజ మట్లు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

రంగము 4. కపిలవస్తుపురము. విశ్రామవనము.

(సిద్ధార్థుఁడు జంబూవృక్షచ్ఛాయఁ గూర్చిండి యుండును.)

సిద్ధార్థుఁడు—(దృష్టిసారించి చూచుచు) ఆహా ! ఏమిది! ఈఁగలను బల్లి, బల్లిని బాము, పామును గ్రద్ద, చంపి తినుచున్నవి! తానొకటి భక్షింపఁ దన్ను వేఱొకటి భక్షించుచున్నది; చిన్న ప్రాణులను బెద్దవి భక్షించుచున్నవి! పిన్నవి సృష్టింపఁబడుట పెద్దవానికొఱకేనా ?... ఏమి యీవిపరీతము!

ఈ ప్రపంచమునఁ బెద్దజంతు వేది? పెద్దజంతు విదియని నిర్ణయించుట యెట్లు ? కాయ పరిమాణముం బట్టియా ? గజమును సింహము సంహరించునే ! సింహమును మానవుఁడు సంహరించునే ! (ఆలోచించును) అహా ! తెలిసె; తెలిసె. జీవకోటులందు శ్రేష్ఠత నెఱుంగుటకు బుద్ధిబలమే నిర్ణాయక మానము. అట్లగుట మనోబుద్ధీంద్రియ శోభితుండగు మానవుఁడేగదా యీ ప్రపంచమున శ్రేష్ఠుఁడు. సమస్త చేతనాచేతనంబులను దనవశము చేసికొని ప్రాణిజాలము నేఁచుట కా యీశ్వరుఁడీసాధన విశేషముల మానవున కొసంగుట ? ప్రపంచమహాభ్యుదయ మపేక్షించి కాక, దేవుఁడీసాధనముల మానవున కూరక ప్రసాదించి యుండునా ? ఈ సాధనముల సద్వినియోగము చేయుటయందే కదా మానవున కవిరతసుఖము లభించుట ! ఎట్లిదైవ ప్రసాదితములగు సాధనవిశేషములఁ బ్రపంచాభ్యుదయమునకై వినియోగించుట ? (ఆలోచించును)

ఆలోచించుకొలఁది, అంధకారయవనిక లొకటి తరువాత నొకటి యెత్తఁబడినను, మఱియెన్నో యవనికా పరంపరలు పొడగట్టుచున్నవే !

(వసుకాముఁడు, శుద్ధోదనుఁడు, మంత్రి ప్రవేశింతురు.)

వసుకాముఁడు—ఇటురండు; ఇటురండు. అదిగో! చూడుఁడు జంబూవృక్షంబునీడ నుండు రాకుమారుని. ఆ చెట్టు నీడను గమనింపుఁడు.

శుద్ధోదనుఁడు, మంత్రి—ఆశ్చర్య మాశ్చర్యము!

శుద్ధోదనుఁడు—వీఁడు చింతామగ్నుఁడై మన రాక యెఱుంగకున్నాఁడు!... .. కుమారా! కుమారా!... ... కుమారా!

సిద్ధార్థుఁడు—జనకుని కంఠస్వరము విని నట్లాయె!

శుద్ధోదనుఁడు—కుమారా!

సిద్ధార్థుఁడు—(లేచివచ్చి) జనకా! పాదాభివందనము సలుపువాఁడను. ఈ మధ్యాహ్నమున మీ రిట్లు రానేల?

శుద్ధోదనుఁడు—ఉదయమునుండి నీవు మందిరమున లేకునికి నిన్ను వెదకికొని వచ్చితిమి.

సిద్ధార్థుఁడు—ఏమో యీ చెట్టునీడ చల్లగ నుండ, ఇందే యుంటిని.

శుద్ధోదనుఁడు-ఆఁకటి ప్రొద్దెఱుంగకుండ నుండుటయా?

సిద్ధార్థుఁడు—నా కాఁకలి కాలేదు. ఇట్లే యుంటిని.

శుద్ధోదనుఁడు—నాయనా! నేఁటి కాఱవ దినమున బున్నమనాఁడు మన శాక్యమహోత్సవము జరుగును గదా! అప్పుడు రాజకన్యక లనేకలు వత్తురు. వారి కానాఁడు నీవు కానుక లిచ్చున ట్లేర్పఱుపఁబడినది. నీ వానాఁ డితర వ్యాసంగము మాని, మహోత్సవ సంరంభమునసే యుండవలెను.

సిద్ధార్థుఁడు—అట్లే యుండెదను.

శుద్ధోదనుఁడు—మంచిది. మందిరమునకుఁ బోవుదము రమ్ము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

రంగము 5-కపిలవస్తు పురమందలి రాచనగరు.

(శుద్ధోదనుఁడు, మంత్రి యాసీనులై యుందురు.)

మంత్రి—వా రన్యోన్యానురాగులై యున్నా రనుటకు వారి పరస్పరప్రేమావలోకనములే ప్రబల నిదర్శనములు.

చ. అతివ యతిప్రమోదయుత యౌచు నపాంగవిలోకనంబులన్
క్షితిప కుమారునిం గనిన, నెయ్యము తియ్యము మీఱ నాతఁడున్,
స్మితము నిజాననంబునను జిందుకొనన్, లలితాంగియా ర్తిపై
మఱియును జూపు నుంచి బహుమాన మిడెన్ దన కంఠహారమున్.

శుద్ధోదనుఁడు—యశోధర వచ్చువేళకు దానపుఁబళ్లెరము లయిపోయి యుంట యదృష్టమే.

మంత్రి—కార్యంబు ఫలగతికి రానున్నపు డన్నియు నిట్లొనఁగూడును.

శుద్ధోదనుఁడు—ఏమ్మనటి ?

మంత్రి—తే. ఎలమి వామాక్షి కానుక గ్రహించు తఱిని
యువతి వదనంబుపై దృష్టి నిపుడఁ జేసె,

యుపకుఁడును నిట్టులపుఁ జూడ్కి నవిదఁ జూచి
యామె లావణ్యరసమును ద్రావుచుండె.

శుద్ధోదనుఁడు—అనంతరము ?

మంత్రి— తే. అంత వారి చిత్తంబు లత్యంతమైన
గాఢరాగరసమున మగ్నంబు లగుచు
నొండొరుల మోముఁదమ్ముల నొప్పమీఱఁ
జిఱుత చెమ్మటల్ నినుపొందఁ జివురు లొత్తె.

శుద్ధోదనుఁడు—అటుపిదప ?

మంత్రి— తే. మందిరమునుండి చనెడి యా మంథగమన
తిరిగి వెన్కకు రాట్సుతుం దివిరి చూచె;
రాట్సుతుండును హృదయంబు రహిదలిర్పఁ
గలికి పోయిన వల నట్టె కనుచు నుండె.

శుద్ధోదనుఁడు—నేను ధన్యుఁడను. నా వంశము ధన్యము. తన కొమార్తెను సిద్ధార్థున కిమ్మని సుప్రబుద్ధరాజును వేఁడుదమా ?

మంత్రి—రాకొమారుని యభిమతము ప్రత్యక్షముగఁ దెలిసికొని యీ పనికిఁ గడంగుట నయము.

శుద్ధోదనుఁడు—వసుకామా ! (వసుకాముఁడు ప్రవేశించును.) నీవుపోయి సిద్ధార్థు నిక్కడికిఁ దోడ్కొని తెమ్ము.

(వసుకాముఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

క. తనయుఁడు దార పరిగ్రహ
మొనరుచు వను ధైర్య మెంత యున్నను నిత్యుడే
మని నడుపునో తనయుం డది
వినఁగా హృదయంబు చాల భీతిఁ గలంగున్.

మంత్రి—ముంజేతి కంకణమున కద్దమేల ?

సిద్ధార్థుఁడు—(ప్రవేశించి తండ్రికి నమస్కరించి యాసీనుఁడై) జనకా ! ఏ కార్యము నాచేతఁ జేయింప నెంచి నన్నిటకు రావించితిరి ?

శుద్ధోదనుఁడు—కుమారా ! నీవు చేయవలసిన ఘనకార్య మొకటి యున్నది.

సిద్ధార్థుఁడు—అది యేది ?

ఉ. ప్రాణివధంబు ఘోరమగుపాప మటంచని బోధసేయనా ?
ప్రాణము రక్షసేయ ఘనవాహనుకైవడిఁ బ్రాణ మియ్యనా ?
రాణ మెయి న్మహిప్రియను బ్రాణిని గావఁగ దేహ మియ్యనా ?
ఏనిటఁ జేయుకార్య మది యెట్టిదొ తెల్పిన నిర్వహించెదన్.

శుద్ధోదనుఁడు—నేను జెప్పునది యిచ్చునట్టిదేగాక, యిచ్చి పుచ్చుకొనునట్టిది. నీ దేహాంతఃకరణంబు లొక్కరి కొప్పగించి, ఆయొక్కరి దేహాంతఃకరణంబుల నీవు చూఱఁగొనవలయును. (సిద్ధార్థుఁ డర్థముగాక కలవరపడును.) అనఁగా నీవొక సత్కులసంజాతయగు తరుణిని బెండ్లాడవలెను.

సిద్ధార్థుఁడు—నిన్నటినుండియు నపూర్వముగా నా హృదయవీణాతంత్రులు స్పందించుచునే యున్నవి.

శుద్ధోదనుఁడు—(తనలో) ఆ స్పందనమే శృంగారగానరసతరంగముల జనింపఁజేయుఁగాక. (ప్రకాశముగా) నాయనా ! మన వంశాభివృద్ధి యంతయు నీమీఁదనే యాధారపడి యున్నది. కుమారా ! తరుణిని జేపట్టుటవలనఁ గలుగు ప్రయోజనము లనేకము లున్నవి.

సీ. సంసారజలనిధి సంతరింపఁగఁజేయు
సురుచిర దృఢ నవ్యతరణి తరుణి;
సంతతామోద సంజనకమై తనరారు
హారుమైన ఫలపుల బరణి తరుణి;
అగ్నితేజఃపుంజు లగుపుత్ర వర్గమ్ము
నావిర్భవింపించు నరణి తరుణి;
అతిమాత్రమైన సంసృతి కష్టభారంబు
కరము మోసెడు నట్టి కరిణి తరుణి;
గీ. భవవియత్పథంబున నభివ్యాప్తమైన
దుఃఖ నీహార బాష్పంబుఁ దొలఁగఁద్రోయఁ
దనదు కరజృంభణము చూపు తరణి తరుణి;
స్వర్గహర్మ్యంపు సోపాన సరణి తరుణి.

తనయా ! ఏ తరుణి పవిత్రప్రేమమారుతము నీ హృదయవీణాతంత్రులను స్పందింపఁజేసి ధన్యతగాంచెనో, ఆమె పావననామమును వినఁగోరుచున్నాను.

సిద్ధార్థుఁడు—(లజ్జ నభినయించును.)

మంత్రి—ఆ తరుణి సుప్రబుద్ధ రాజపుత్రిక. యశోధరాభిధాన. సుగుణఖని.

శుద్ధోదనుఁడు—కుమారా ! ఆ తరుణినే చేపట్టుము.

సిద్ధార్థుఁడు—(తనలో) అనురాగవశమున మధుర గంభీరగీతముల నా హృదయవిపంచి చిత్రముగ నాలాపించుచున్నది ! (ప్రకాశముగ) జనకా ! మీ యాజ్ఞనే శిరసావహించెదను.

శుద్ధోదనుఁడు—ధన్యోస్మి; ధన్యోస్మి. మంత్రివరా! తన కొమార్తెను సిద్ధార్థున కియ నభ్యర్థించుటకై యోగ్యులగు పురోహితులను 'కోలీపురము' నకు సుప్రబుద్ధరాజు కడకుఁ బంపుము.

మంత్రి.—మహాప్రసాదము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

రంగము 6. కోలీపురమునందలి యశోధరా మందిరము.

(యశోధర యాలోచించుచుఁ గూర్చుండి యుండును.)

యశోధర—(తన మెడయందలి సిద్ధార్థుఁ డిచ్చిన హారముఁ బట్టుకొని)

ఉ. ఓ రమణీయహారమ! సుఖోచితభంగిని రాకుమారు గ్రీ
వా రుచిరప్రదేశమున బ్రాఁతిగ వర్తిలి యిప్డు నాదు వ
క్షోరుహ యుగ్మమధ్యమునకుం జనుదెంచిన కొలె నాకు బ
ల్దారుణ రీతిఁ జిత్తపరితాపముఁ గూర్చె దిదేమి చిత్రమో?

శా. సిద్ధార్థుం డభిరూపతేజుఁడు కృపాశ్లేషాంచిత స్వాంతుఁడున్
సద్ధర్మాత్ముఁడు నవ్య యౌవన విలాస స్ఫూర్తిమంతుండు దా
బద్ధాకుంఠిత మోహుఁడై చను నను౯జేపట్టంగఁ గాంక్షించునో
శుద్ధబ్రహ్మముఁ బొందఁగోరి విపినక్షోణిం బ్రవేశించునో.

ఆ రాకుమారుని సౌందర్యమధువును గ్రోలిన దాదిగ మన్మనోభృంగ మయ్యెడనుండి మరలకున్నది. వైరాగ్య భావ తత్పరుండగు నమ్మహానుభావుఁడు దారపరిగ్రహమున

కిష్టపడునా ? ఆతని చేష్టావిశేషంబులఁ గనుఁగొన్న, నాయం దాతఁ డనురక్తుఁడై యున్నట్లు గోచరించుచున్నది.

ఉ. ఆ రమణుండు నాకుఁ దనహారము నిచ్చుట, దాని నిచ్చుచో
స్మేరము హాస్యపద్మమున మేకొనఁజేయుట, నాదు మూర్తి నిం
పారెడు చూడ్కిఁ జూచి ముదమందుట, మోమున లేఁతచెమ్మటల్
గూరుట, యివ్వియే యగును గూరిమిఁ జాటెడు నట్టిచేంవముల్.

నా యెడమకన్నేటికో యదరుచున్నది !

ఇందిర—(ప్రవేశించి) నారాకయె దానికిఁ గారణము.

యశోధర—నీమాట నా కర్థము కాలేదు.

ఇందిర— నేను వచ్చితిని; నీ యెడమ కన్నదరెను. నేను వచ్చుటయె శుభము.

యశోధర—నీ వెప్పుడుఁ బోవుచు వచ్చుచుందువు. నీవు వచ్చునప్పు డంతయు నెడమకన్నదరుట లేదే.

ఇందిర—అప్పుడు నారాకవలన శుభము లేకుండెను.

యశోధర—ఇప్పు డేమి శుభముఁ దెచ్చినదానవు ? అదేదో చెప్పుమా. నీవే నా కన్నులు, నా చెవులు.

ఇందిర-అట్లయిన నీవు గ్రుడ్డిదానవా? చెవిటిదానవా?

యశోధర—నిజముగ నే నిప్పటి కట్టిదాననే. చైతన్యము గూడ లేనిదాననై యున్నాను.

ఇందిర—అట్లయిన నీ కాళులు నేనే; నీ ప్రాణము నేనే; నీ దేహము నేనే, వేయేల ? నీవే నేను. అట్లని నేను-సిద్ధార్థుని వివాహ మాడిన నీ వూరకుందువా ?

యశోధర—చెలీ ! ఇందిరా! పరిహాసమువలదే. నిన్ను వేఁడుదానను. నీవు దెచ్చిన శుభవార్తను విప్పిచెప్పి నన్ను రక్షింపుమా.

ఇందిర—ఏమి ! అంతలోఁ బ్రాణములు పోవునా ?

యశోధర—

తే. విషయమందున నభిరుచి పెంపొనర్చి
సమధి కార్త్స్న్య పరివృత స్వాంతఁ జేసి
విషయ మఖిలంబు చెప్పక విడుటవలన
నుత్కటంబగు వ్యథగల్గు నుల్లమునకు.

అట్టి మనోవ్యథవలనఁ బ్రమాదములు కొన్నివేళలఁ గలుగును.

ఇందిర—దీనికే నీవు తాళలేకున్న, రేపు వైరాగ్య చిత్తుఁడగు సిద్ధార్థునిఁ బెండ్లాడినపుడు, అతనితోఁ బ్రతిఘటన గలుగునుగదా. అప్పు డెట్లోర్వఁ గలవు ?

యశోధర—ఆ మాట లిప్పుడేల ?

ఇందిర-వరుని గుణవిచారము వివాహానంతరముననా?

యశోధర—నా కదంతయు వలదు. నీతో మాటాడి గెలువఁజాల. నీవు తెచ్చినవార్త చెప్పెదవా లేదా? లేకున్న నేఁబోయెద. (పోఁబోవును)

ఇందిర—(యశోధర చెయిపట్టుకొని) చెలీ ! చెప్పెద రమ్మ. శుద్ధోదనమహారాజుగారి యొద్దనుండి యిద్దఱు పురోహితులు వచ్చినారు. నిన్ను సిద్ధార్థుని కీయ మహారాజుగా రర్థించుచున్నారని వారు మీ తండ్రిగారితోఁ జెప్పిరఁట.

యశోధర—(ఆత్రముతో) ఇందిరా ! ఈ సంగతి నీ వెట్లు తెలిసికొంటివి ?

ఇందిర—మీ తండ్రిగారు రాణివాసమును బ్రవేశించి, యీ సంగతిని మీ తల్లిగారితోఁ జెప్పుచుండఁగా వింటిని.

యశోధర—మాయమ్మ యందుల కేమనెను?

ఇందిర—చిఱచిఱలాడుచు వచ్చిన యాయన యీ సంగతి నమ్మగారితోఁ జెప్పి, 'కొలువున మంత్రి పురోహిత గణ ముఖ్యులతో నాలోచింపఁ బోవుచున్నా' నని నుడివి, తత్క్షణమే వెడలి పోయెను. అమ్మగారు బదులాడుట కవకాశమే యుండలేదు.

యశోధర—అక్కటా! ఇం దేదో విఘ్నము గలుగ నున్నది. హా! చెలి! నీవు తెచ్చిన దెట్టి శుభవార్తయే!

ఇందిర—నేఁ దెచ్చిన దేల శుభవార్త గాదు? 'సిద్ధార్థుఁడు నాయందు బద్ధానురాగుఁడై యున్నాఁడో లేడో, శుద్ధోదన మహారాజుగారి యభీష్ట మెట్లున్నదో యేమో' యని సందేహాంధకారమునఁ బ్రాఁకులాడుచుండిన నీ కిది శుభోదంత మెట్లు గాదు? ఇంక మీ తండ్రిగారి యభిప్రాయమా. అది ప్రతికూలముగ నున్నను, నీవును మీ యమ్మయుఁ బట్టుపట్టి ప్రతిఘటించిన, నతని దేమి సాగును? వివాహ విషయములోఁ గన్యామాతల యభిప్రాయమే ప్రధానము.

యశోధర— చెలీ ! నీ వచన ఝంఝూమారుతము వలనఁ గొంత సంశయాంభోధరములు తొలఁగి యాశలు వెలయుచున్నవి. ఇందిరా! కొలువున నేమి జరిగినదో తెలిసి కొనవలెను.

ఇందిర—నే నిక్కడకు వచ్చుటకు మునుపు సంధాగారమునకుఁ బోవనున్న మా యన్నను జూచి మాటాడితిని. అతని నడిగిన సంగతులు తెలియును.

యశోధర—ఇందిరా! నీవు కడుజాణవు. చెలీ! ఇప్పటికి సభ ముగిసియుండును. నీవు పోయి యుదంతము దెమ్మా.

ఇందిర— నీ వింటదే యుండును. పోయివచ్చెదను.

యశోధర—వేగిరము రమ్మా. (ఇందిర నిష్క్రమించుచున్నది. యశోధర యాలోచించుచు)—

సీ. ఏసందియము గల్గె నీసభ జనకుండు
నియ్యెడఁ జేర్పంగ నెంచె నొక్కొ?
జననిముందఱ నెప్పుఁ గనలు చూపనితండ్రి
యిపుడేల యిటు లాగ్రహించె నొక్కొ?
పరగుణ కలితుఁ డీపరునకు నన్నియ
వెనుఁబాటు పడ నేమి పొనరెనొక్కొ?
మైత్రిని ఖాటించు మత్పిత శుద్ధోద
నుండెక్కొ యిప్డు పోనూకు నొక్కొ?
గీ. అకట! యుపహార గ్రహణంబునకును నన్నుఁ
బ్రేమమైఁ బంపినట్టి మత్పితకు నిప్పు
డింత ప్రతికూలబుద్ధి జనింప నేలొ?...
సర్వము గహనమైనట్టి సరణి దోఁచు.

హా! నామనోరథమ్మెట్లు సిద్ధించు? ఎట్లు సిద్ధింపఁజేసికొందు? నామన స్సిందిర రాకకై యెదురుచూచుచు ముందరికి నడువనేరకున్నది ... ... ... ... ఎంత జాగు చేయుచున్నదీ యిందిర!

(ఇందిర ప్రవేశించును.)

ఇందిరా ! ఘనపయోవృష్టికిఁ జాతకమువలె నేను నీకై యెదురుచూచుచున్నదానను.

ఇందిర—కాని, పిడుగులును రాళ్లును దప్ప మఱేమియు నీకు లభించుట లేదే.

యశోధర—(తనలో) హృదయమా ! చిక్కఁబటుము. (ప్రకాశముగ) అది నాభాగ్యము.

ఇందిర—సిద్ధార్థుఁడు బాహుబల వర్జితుఁ డఁట; క్షత్ర ధర్మ రహితుఁడఁట; పరాక్రమ హీనుఁడఁట; వైరాగ్యచిత్తుఁ డఁట; సోమరి యఁట.

యశోధర—ఎవ రిట్టి గుణారోపణము చేసినది ?

ఇందిర—ఎవఁడో సిద్ధార్థుని దాయాదియఁట; దేవ దత్తుఁడఁట. అతఁడు సభకు వచ్చియుండి, సిద్ధార్థుని గూర్చి యిట్టి యభిప్రాయములను సభవారికిని, ముఖ్యముగ మీతండ్రిగా రికిఁ దలకెక్కించినాఁడట.

యశోధర—సరె, సరె. ఇప్పుడు దెలిసె. ఎవరో రాచ వారు వచ్చినారని నేఁ డుదయముననే నగరులో విందులు వినో దములు జరుగుచుండెను. అవి యీ దేవదత్తుని కొఱకేయైయుం డును. మాతండ్రి కీవైమనస్యము గలుగుట కీ దేవదత్తుఁడే కారణ మయియుండును. ఓరీ ! దేవదత్తా ! నీ దాయాద మత్సర మింత దగునా ? ... ...

ఇందిరా ! ఏమ్నాటి వృత్తాంత మేమి ?

ఇందిర— పరాక్రమవంతుఁడగు రా కుమారునకు నిన్నీయ నిశ్చయించి యుండుటచేత, మీ తండ్రిగారు సిద్ధార్థునివంటి పందకు వైరాగికి నిన్నీయరఁట. సామాన్యరాజులకు భేదింపరాని సింహాయంత్రంబు రచించి, దానిని 'సింహహనువు' తో భేదింపఁగల బాహుబలశాలికి నిన్నిత్తురఁట.

యశోధర—దానికి గణముఖ్యు లేమనిరో ?

ఇందిర—గణముఖ్యు లందఱు నిట్టి స్వయంవర విధికే సమ్మతింపఁగా, మీతండ్రిగారు తమ యీ యభిప్రాయములను దెలుపుచు శుద్ధోదనమహారాజుగారికిఁ బిదప నొక లేఖను వ్రాయుదు మని రఁట.

యశోధర—హా ! తండ్రీ ! తండ్రీ ! పశుబలమే ప్రేమబలంబుకంటె నెక్కుడని తలఁచితివా ? నాపవిత్ర ప్రేమను బాహుబలమునకు విక్రయింప నెంచితివా ? హా చెలీ ! ఈ పిడుగువంటి వార్త విన్నదాదిగ నాచిత్తము శోకదైన్యములకు వివశ మగుచున్నది.

ఇందిర—చెలీ ! ధైర్యము చిక్కఁబట్టుము. ఏపుట్టలో నేపాముండునో యెవరి కెఱుక ? సిద్ధార్థుఁడు దోర్వీర్యమందును ధనుర్విద్యయందును సామాన్యుఁడు కాఁడని కొందఱు నుడువుచున్నారు.

యశోధర—ఏమో ! దైవమే నాకు దిక్కు. హా ! తండ్రీ ! తండ్రీ ! ... ...

ఇందిరా ! ఇప్పుడేమి చేయుదమె?

ఇందిర——వీరి బాబును గాంచిన శుద్ధోదనమహారాజు ప్రతిక్రియ చేయ కూరకుండునా ? కావున, ధైర్యము వహించి యుందుము. మనమును దగిన ప్రయత్నములు చేయుదము. మీా తండ్రిగారు మీాతల్లిగారితో మాటాడుటకు రాణివాసము నకు వచ్చియుందురు.

యశోధర——మనమును నక్కడకే పోవుదము.

(నిష్క్రమించుచున్నారు.)

———

# గౌతమ బుద్ధుఁడు.

---

## ద్వితీయాంకము.

రంగము 1. కపిలవస్తుపురము-విశ్రామవనము.

(సిద్ధార్థుఁడు హంసతోడను, పాలగిన్నెతోడను ప్రవేశించును.)

సిద్ధార్థుఁడు—(హంసను జంకలో నుంచుకొని నిమురుచు ముద్దిడుచు) ఓ మరాళరాజమా! ఈ పాలు త్రాగుము. ... పాలు త్రాగి నీళ్లు విడచితివే! నీగుణ మెంతె యాదర్శకము! అందులకే నేనును హంసను గాఁ గోరుచున్నాను ... ... అదే! సూర్యోదయమైనది; సుఖముగాఁ బొమ్ము.

తే. హంసరాజమ! నీదు పక్షాంతరమున
కావవి యున్నట్టి గాయ మిం పొదవ మానె;
పక్షబలమును మునుపోలెఁ బ్రాప్తమయ్యె;
పాటిపోయి నీ పదు వింకఁజేరికొమ్ము.

(హంసను బోవిడువఁగా, అది యెగిరిపోక సిద్ధార్థుని భుజముపై వచ్చి చెక్కిలిని జంచువుతో నొత్తుచుండును.)

రాజహంసమా! ఏల పోవకున్నావు? నన్ను విడిచిపోవ నీకు తెక్కలాడవా? ఓ జాలపాదమా! నీవు దైన్యమందవలదు. క్రౌంచ బిలముగుండ, నీనెలవగు మానససరోవరమునకుఁ జనుము. మానసతీర్థమున స్నాతుఁడఁగావలయు నని నాకును గుతూహల మున్నది. నీవిప్పు డగ్రగామివై చనుము. (పక్షికల

నాదము చేయఁగా దానిని బోవిడుచును. అది పోవును. దాని పోయినవల నట్టె చూచుచు)—

తే. ఆకృజంబగుచక్కయో యనఁ జెలంగె...
అంబరముతోడ నేకమై యతిశయిల్లె;
పులుఁగు నమవీడి దూరంబు పోవుకొలఁదిఁ
బ్రేమపాశంబు దీర్ఘమై పెంపుగాంచె.

చెన్నుఁడు—(జాబుతోఁ బ్రవేశించి) రాకుమార! సుప్రబుద్ధరాజుగారు వ్రాసిన యీ లేఖను దమకిమ్మని మహారాజుగారు నా కాజ్ఞ యిచ్చినారు (జాబిచ్చును).

సిద్ధార్థుఁడు—చెన్నా! నాయన గా రెందున్నారు?

చెన్నుఁడు—ఆస్థానమున మంత్రిసత్తమునితో నున్న వారు. ఈయుత్తరముం గాంచినది మొదలు శోకాగ్రహ చిత్తులై యున్నవారు.

సిద్ధార్థుఁడు—సుప్రబుద్ధరా జేమి వ్రాసియున్నాఁడో! (జాబు విచ్చి చదువుచు)

"రాజశిరోమణీ! భవదీయ పురోహితుల వలనఁ దమరు నాకుఁబంపిన సందేశమందినది. నేను బురుషసంతాన హీనుఁడ నగుటచేతను, తత్కారణమున నాయనంతరము మదీయ రాజ్యమునకు నాజామాతయే యేలిక కావలసి యుండుట చేతను, రాజనీతి కుశలుండును, బాహుబల సమధికుండును, శౌర్యసమన్వితుండును, ధనుర్విద్యాధౌరేయుండును నైన రాకొమారునికేఁగాని నాతనయ నియ్యనని నే నిదివఱకే సంకల్పించినవాఁడను."

రాష్ట్రమునకు రాజు కాఁబోవువాఁ డిట్టి గుణాన్వితుఁడై యుండవలసినదే. కన్యాజనకుం డిట్టి సంకల్పము చేయుట సమంజసమే. చెన్నా! ఈ విషయమై నీ యభిప్రాయ మేమి?

చెన్నుఁడు—తనకుఁ గాఁగల యల్లుఁడు క్షాత్రతేజము గలవాఁడై యుండవలెనని మామగారు కోరుటయం దేమి తప్పు?

సిద్ధార్థుఁడు—(జాబు చూచుచు) "మీ కౌమారుం డగు సిద్ధార్థుం డనధిగత చాపాద్యాయుధ వ్యాపారుండును, ... ...అపగత క్షత్రధర్మ్ముండును, ... . విక్రమశ్రీ వివర్జితుం డును, .. ... ...సుకుమార శరీరుండును, ... ... ...అని నాకుఁ దెలియవచ్చుటచే, నేనాతనికి నాతనయ నిచ్చి వివాహ మొనర్చి, మీ యభీష్టమును ... ... నెఱవేర్పఁజాలనందులకు మిక్కిలి చింతిల్లువాఁడను."

ఆహా! చెన్నా! నన్నుఁగూర్చి యెట్టి యభిప్రాయములు వెలువడినవో చూచితివా?

చెన్నుఁడు—ఈవ్రాఁతకే కాఁబోలు మహారాజుగారికిఁ గోపము గలుగుట.

సిద్ధార్థుఁడు—(జాబు చూచుచు) "అనధిగతచాపాద్యాయుధ వ్యాపారుఁడు"—చెన్నా! నేను విశ్వామిత్రాచార్యులకడ సకలవిద్యలను నేర్చినది, పాపము, నృపబుద్ధరాజేమి యెఱుఁగును?

చెన్నుఁడు—అత్యల్పకాలమున నేర్చుటచేత, మీరు సకలవిద్యాసంపన్నుల రని లోకమే యెఱుంగదు.

సిద్ధార్థుఁడు—(జాబు చూచుచు)"అపగత క్షత్రధర్ముండును, విక్రమశ్రీ వివర్జితుండును ..."

చెన్నుఁడు—రాకుమారా! భవదీయ వంశానుగతమయి మీ రక్తనాళములందుఁ బ్రవహించుచు, మీ రక్తమందిమిడియున్న క్షాత్రతేజము మీయందుఁ దొలఁగియున్నదనుట సాహసమే.

సిద్ధార్థుఁడు—విక్రమాటోపముఁ జూపుసమయ మాసన్నముగా లేదు గావున, నిట్లున్నాఁడను. ధర్మమున కోటమి సంభవించెనా యప్పుడుగదా విక్రమవిజృంభణముఁ జూపవలయును.

చెన్నుఁడు—విక్రమాడంబరము గర్హించువారగుటచే మిమ్ముల గుఱించి లోక మిట్లు తలపోయుచున్నది.

సిద్ధార్థుఁడు—(జాబు చూచుచు) "సుకుమార శరీరుండును"—నేను సుకుమార హృదయుండను గాని, సుకుమార శరీరుండను గాను. ఎంతటి కష్టములకైన నోర్వఁగల యీశరీరము సుకుమార మగునా?

చెన్నుఁడు—మీ విషయమై సుప్రబుద్ధరాజేమియు నెఱుంగఁడు.

సిద్ధార్థుఁడు—ముందుఁ జూతము. (జాబు చూచుచు) "ఈ వైశాఖ శుక్లపక్ష దశమీ గురువాసరంబున మదీయ పుత్రికయగు యశోధరకు మహాస్వయంవర మీ కోలీపురమున నే వర్తిల్లున ట్లార్యులు నిశ్చయించినారు. సిద్ధార్థకుమారుని మహాస్వయంవరమునకు రాఁ బ్రార్థించువారము."

స్వయంవరము రచించి నన్నాహ్వానించినవారు. ఇంకేమి కావలయును ?

చెన్నుఁడు—యశోధరాకుమారి మీయందు బద్ధానురాగయై యున్నట్లు తెలియుచున్నది.

సిద్ధార్థుఁడు—అది నాఁడే యెఱుంగుదును. ముందు వ్రాఁత చూతము. (జాబు చూచుచు) "అంతరిక్షమున నేరచింపఁగల యంత్రసింహమును మత్పితామహునిదగు 'సింహహాను' వను కోదండముతో మీపుత్రుఁడే భేదింపఁ గల్గినచో, వీర్యశుల్క యగు నా తనూజ మీ కోడలే యగును."

అస్మదీయ విద్యాగురువగు విశ్వామిత్రాచార్యుల యనుగ్రహమున నే నా సింహయంత్రమును గెడపఁ జాలుదు నని నాకు దృఢవిశ్వాస మున్నది.

చెన్నుఁడు—కాని, విలువిద్యయందు మీ కంత నేర్పున్నదా యని మహారాజుగారికి సందేహమున్నది.

సిద్ధార్థుఁడు—కావుననే యశోధర తనకుఁ గోడలగునా యని సంశయించి, యీ లేఖను నిరాకరణ సూచకముగా భావించి, యాయన శోకాగ్రహముల కించుక వశుఁడై యుండును.

వసుకాముఁడు— (ప్రవేశించి) జయము జయము ; రాకుమారా! మహారాజుగారు మిమ్ముల నాస్థానమునకు రాఁగోరుచున్నారు.

సిద్ధార్థుఁడు—జనకాజ్ఞ యవశ్య కర్తవ్యము. చెన్నా! పోదము పద. (అందఱు నిష్క్రమించుచున్నారు.

---

రంగము 2. కపిలవస్తు పురము—రాచనగరు.

(శుద్ధోదనుఁడు, మంత్రి, కూర్చుండి యుందురు.)

శుద్ధోదనుఁడు—ఈ దేవదత్తుఁ డెంత రగులఁ బెట్టు చున్నాఁడు!

మంత్రి—దుష్టుని కార్యమే యది. కాని, వాని దేమిసాగును?

శుద్ధోదనుఁడు—అట్లయిన, ఆత్యంతికోపాయము వలదా?

మంత్రి—కార్యంబు తనంతనే ఫలగతికి గానున్న పుడు యుద్ధమల?

శుద్ధోదనుఁడు—నాకేమో సిద్ధార్థుని చాపవిద్యా ప్రావీణ్యమునం దంతి విశ్వాసము లేదు. బహుదినములుగ వాఁడు ధనుస్సు చేతఁ బట్టుటయే లేదు.

మంత్రి—రాజేంద్రా! అతఁ డలోక సామాన్యుఁడగు చాపవిద్యా చతురుండని విశ్వామిత్రాచార్యులనుడువ లేదా? నేర్చిన విద్య యెందుఁ బోవును?

శుద్ధోదనుఁడు—వారి వాక్కులందు నాకెంతి గౌరవ మున్నను, ఈ ధనుర్విద్యా పరీక్షయందు సిద్ధార్థుఁ డుత్తీర్ణుఁ డగునా యను సందేహము మాత్రము నన్ను వదలకున్నది. వీఁడా పరీక్షయందు విజయమునుఁ గాంచకున్న నెట్లు?

మంత్రి—అప్పుడు సుప్రబుద్ధ రాజు నెట్లో లొంగఁ దీయుదము.

సిద్ధార్థుఁడు—(ప్రవేశించి) నాయనా! ప్రణామములు.

శుద్ధోదనుఁడు—కుమారా! కూర్చుండుము. లేఖ చదివితివా? సుప్రబుద్ధుం డెంత గర్వోపేతుఁడు! ఎంత వృథాభి

మాని ! మదీయాభ్యర్థనమును నిరాకరించినాఁడు. నిరాక రించుటయ గాక, నిన్నెట్లు తూలనాడినాఁడో చూచితివా? ఇట్టి గర్వసమన్వితుని సంగరమున నోడించియే కన్యను దేవలయు నని నా యాశయము. కాని, సచివవయస్యుఁడు సమ రము వల దనుచున్నాఁడు. ఇం కే యుపాయమునఁ గన్యను సాధింప నగును?

సిద్ధార్థుఁడు—ఉపాయ ముత్తరమునందే తెలుపఁబడి యున్నది. స్వయంవర దినమున జరుగు ధనుర్విద్యా పరీక్ష యందు విజయ మందుటయె యుపాయము.

శుద్ధోదనుఁడు—పరీక్ష లన్న నా కసహ్యము. ఎంత విద్యాభ్యాస మున్నను, ఎంత యాత్మవిశ్వాస మున్నను, పరీక్షలందు ఫలసిద్ధి పొందుట సంశయాస్పదము. కావున, రణమె కరణీయ మగును గదా ?

సిద్ధార్థుఁడు—జన నాశకరంబును, అధమ సాధన మును నగు యుద్ధమును దలపెట్ట నేల? నా కార్ముకవిద్యా ప్రావీణ్యముం జూపి, సింహహానువుతోడనే యా సింహ యంత్రమును భేదించెదను. అట్లు చేయఁజాలుదు నని నాకు దృఢవిశ్వాస మున్నది.

శుద్ధోదనుఁడు—అట్లయిన స్వయంవరముననే నీవా సింహయంత్రమును భేదించి యశోధరం బొందెదవు గాక! కుమారా! ఈ కొన్ని దినము లైనను ధనుర్విద్య నించుక యభ్యాసము చేయుచుండుము.

సిద్ధార్థుఁడు—మీ యాజ్ఞ శిరసావహించెద. (ప్రణ మిల్లును)

శుద్ధోదనుఁడు—కల్యాణమస్తు! (సిద్ధార్థుఁడు నిష్క్రమించును.) అమాత్యవరా! స్వయంవరమునకు మనము సముచిత రీతిఁ బోవలయును. ఒకవేళ యుద్ధము జరుగవలసిన, అందులకును సిద్ధముగా నుండవలెను.

మంత్రి—యుద్ధమునకు సిద్ధపడియే తరలుదము.

(నిష్క్రమించుచున్నారు.)

---

రంగము 3. కపిలవస్తు పురము. విశ్రామవనము.

(వీఁపునఁ దూణీరమును, చేత ధనువును, ధరించి సిద్ధార్థుఁడుండును.)

సిద్ధార్థుఁడు—(బాణమేసి) అదే సప్త తరుమూలములను దాటి దూసిపోయినది ! ... . ఆ తరుశాఖల నంటి, గాలి కూగుచున్న యా చెలఁది తంతువును భేదించెద. (మరల బాణమెక్కుపెట్టి యేసి) అహా ! అది భేదింపఁబడి యీ యుదయకాలపు లేఁతయెండకు వింత రంగు లీనుచు వ్రాలెడిని. గురుముఖమున నేర్చిన విద్య వ్యర్థ మగునా ?

ఓ కోదండమా! నీ ప్రభావమును 'సింహహనువు'నఁ బ్రసరింపఁజేసి యశోధరా స్వయంవర సమయమున దానిచే సింహయంత్రమును బడఁగొడపునట్లు నా కనుగ్రహింపుమా.

(పొరిఁబొరి మార్వ్రిలాగుచు) ఈ నారియుఁ గోదండమును నెంత యన్యోన్యాశ్రయము గలిగి కవగూడి యున్నవి! సతీ పురుషు లిట్లుగదా యుండవలెను. నారి ధనుర్దండమును వంచి, తన వంకకుఁ ద్రిప్పికొన్నను, అది దానిని వ్యతిక్రమింపక

యనుకూలముగనే వర్తిల్లుచున్నది. నారియుఁ బురుషుఁడును నిట్లే వర్తిల్లుట శ్రేయస్కరము గదా. నారిలేని పురుషుఁడును, నారిలేని కోదండమువలె వ్యర్థము. మౌర్వీ చాపముల వలెఁ బరస్పరానుకూల్యము గల సతీపురుషుల దాంపత్యమెంత నిశ్రేయసము' యశోధరా గుణ మిట్టిదై యుండునా?

వసుకాముఁడు—(ప్రవేశించి) జయము! జయము! యువరాజా! కోలీపుర ప్రయాణమునకు బంధుమిత్ర పురోహితామాత్య పరివార సమేతముగా సన్నద్ధులైన మహారాజు గారును, గౌతమీదేవిగారును, నన్నుఁ బిలిచి యిట్లాజ్ఞాపించి నారు: 'కుమారుఁడు విశ్రామ వనమున నుండును; తోడి తెమ్ము' అని.

సిద్ధార్థుఁడు—ఔను; ప్రయాణమునకు సిద్ధపడవలెను.

(నిష్క్రమించుచున్నారు.)

---

రంగము 4. కోలీపురము: స్వయంవర మండప సమీప ప్రదేశము.

దేవదత్తుఁడు—(కోప ఘూర్ణితుఁడై ప్రవేశించి)

ఉ. పార్థసముండు శౌర్య విభవంబునఁ గార్ముక విద్యలోన సి
ద్ధార్థుఁడె యంట; వాఁడు హరియంత్రము నేయుటఁ జేసి పుత్రి !
ప్రార్థన సేల్లఁ బండెనఁట యంచితభంగిని; దీర్ఘకాల సం
వర్ధితమైన కోర్కె పరిపక్వగతిం గనెనంట యిట్లుగాక.

ఇట్టి ప్రలాపము లీస్వయంవర భవనమున బాహిరముగాఁ బలుకుట కీనుప్రబుద్ధున కెంత కండకావర ముండవలయు!

సిద్ధార్థునకే తన తనయ నీయవలె నను కోర్కి దీర్ఘకాల ముగాఁ గలవాఁడు నా మాటవిని యీ కోలీపురమున స్వయం వరము రచించు టేల? ఇట్టి పలుకులు పలికి మముఁ గోలు రా కుమారుల నవమానించుట కా? ఈ యవమానమును వడ్డితోఁ గూడఁ దీర్పక లేక పోదునా?

గ్రుడ్డి యేటు గూఁటిలోఁ బడె నన్నట్లు సిద్ధార్థుని బాణ మెట్లో యంత్రసింహ నేత్రమునఁ దూఱి దాని బంధించిన సూత్రమును భేదించెఁ గాక! వాఁడొక మేటి విలుకాఁడ టే? నే నేసిన బాణము కొంచెము గుఱితప్పి సింహకర్ణమున గాడె. ఏమి ప్రయోజనము?

వాఁడా యంత్రముఁ దెగ నేయుడు సభికులందుఁ గలిగిన యా యానంద మేమి! ఆ త్రుళ్లింత లేమి! ఆ యఱపు లేమి! ఆ కేరడము లేమి! ఆ కరతాళధ్వను లేమి! వారి యఱపులకుఁ గరతాళధ్వనులకు నా హృదయ గుహాంతరంబున నిద్రించు చున్న క్రోధ మత్సరము లనెడి సింహద్వయం బేపారి బయల్వె డలె. ఈ ప్రతిపక్షులను గబళించుదాఁక వానికి నిద్రపట్టునా?

ఆ లావణ్య మధుర యశోధర స్వయంవర భవనమున నా యెట్టయెదుట నా ప్రత్యర్థియగు సిద్ధార్థుని కంఠమున సుమ దామ ముంచెఁ గా! ఇంతకంటె నాకుఁ బరిభవ మే మున్నది?

గీ. మహిత పరిభవ దావాగ్ని మండుచున్న
నాదు బహుళమ్మ హృదయ కాంతారమునకుఁ
దక్ ప్రతీకార వర్ష పాతమును జేసి
తెచ్చు పెరవున దానిఁ జల్లార్చువాఁడ.

(నిష్క్రమించుచున్నాఁడు.)

# గౌతమబుద్ధుఁడు.

---

## తృతీయాంకము.

### రంగము 1. కపిలవస్తు పురము—ఉపవనము.

(యశోధరా సిద్ధార్థులు నడచుచు వత్తురు.)

యశోధర—నాథా!

సీ. పరభృత నికరంబు లనురక్తి నిజకుహూ
కలనాదము లొనర్చి కొలువు సేయఁ,
సురవర మల్లికా కుసుమ గంధంబులఁ
బవనుండు హాయి వీవనలు వీవ,
వకుళ పున్నాగ చంపక వృక్ష బృందముల్
ప్రసవాంజలుల మాకుపైనఁ జల్ల,
వల్లరుల్ దమ శోభ ఫుల్లలతాంతదీ
పికలతో హారతుల్ వేడ్కఁ జేయ,

గీ. మధురమౌ సుందరీమణి మనకు నిట్లు
లతిథి సత్కారముల్ ప్రీతి నాచరింప,
నెడఁద యుత్తేజితము గాచు నింపుమీరెఁ
గాఢ జాలియుఁ గడసంగఁ గంటె మిత్ర.

సిద్ధార్థుఁడు—ఈ మధులక్ష్మి యెట్టి యతిథిసేవాతత్పర!

యశోధర—పరసేవయే లోకమున వెలయునది. ...
జీవితేశ్వరా! స్వచ్ఛములై మిఱుమిట్లు గొలుపుచుఁ బ్రవహిం

చెడి యీ నిర్ఝరములు మధులక్ష్మీ వక్షంబుపైని యుజ్జ్వల తారహారములో యన మెఱయుచున్నవి.

సిద్ధార్థుఁడు—ఈ విమలతర శైలస్రవంతీ తరళ తరంగ హస్తములు స్ఫటికశిలాతలంబు లనెడి సారెలపైఁ జనుచో జనించు మనోహరనాదము వినుచున్నావా?

యశోధర—ఈ నాదము మిక్కిలి యింపుగ నున్నది. ...నాథా! ఇంత దూరము మునుపు నే నెప్పుడును రాలేదు.

సిద్ధార్థుఁడు-మందిరమునకు మరలుద మనుచున్నావా?

యశోధర—లేదు; లేదు.

సిద్ధార్థుఁడు—ఈ మార్గమందలి యా వంపు దిరిగి యావల నే మున్నదో చూడ నీకపేక్ష యున్నదా?

యశోధర—ఉన్నది. మన దృష్టుల మఱుఁగుపఱచు నట్టి యా గిరుల కావల, ఏముండు నది కనుఁగొనుటకు నాకభిలాష మున్నది.

సిద్ధార్థుఁడు—ఈ యభిలాష యుండుట మంచిదే.

యశోధర—ఆ వంపు నడచి యా స్రవంతిని దాఁటి యా కొండ నెక్కుదము.

సిద్ధార్థుఁడు—అట్లే చేయుదము. (ఇద్దఱు నడిచి కొండ యెక్కుట నభినయింతురు.)

యశోధర-ఆ చెట్టునీడను గూర్చుందుదము. (నడతురు)

(ఇరువురు చెట్టుక్రిందఁ గూర్చుందురు.)

సిద్ధార్థుఁడు—(దృష్టి సారించి చూపుచు) అదియె విశ్రామవనము. అవియె మన ప్రమోద భవనములు: అది 'సురమ'; అది 'రామ'; అయ్యది 'శుభ'. ఈ వైపున—అది

సంథాగారము; అది రాజమందిరము; అది యమృతభవనము. ఈ యెడమ దిక్కున, సురమ సమీపమున నుండునదే న్యగ్రోధ వనము. వీని నంతయుఁ జుట్టియున్న యావరణపు గోడ యిటీవల నిర్మింపఁ బడినదె. పుర మీ దిక్కున నున్నది; దాని నీ యున్నత శిఖరము మఱుఁగు పఱచుచున్నది. నేను పురముఁ బ్రవేశింపక బహుకాలమాయె. నీవు వచ్చినది మొదలు పురప్రవేశమే నేను జేయలేదు. ఇప్పుడు పురము చూడవలె నని కోరిక పొడముచున్నది.

యశోధర — ప్రాణేశ్వరా! ఆ మేఘచిత్రముం గాంచుఁడు. ఆకాశ నీలపటమున జగచ్ఛిల్పిచే నాలిఖింపఁబడిన విన్నాణపుఁ జిత్తరు వ్రాయనఁ జూపట్టుచున్నది.

సిద్ధార్థుఁడు — ఆహా! ఆ యభ్రవ్యాఘ్ర మెంత రమణీయముగ నున్నది!... అది యెట్లు శిథిల మగుచున్నదో చూడు. అది శిథిలమై జంబుకముగ మాఱినది!... అదియు మాఱి కుక్క యైనది!

యశోధర — కుక్క యొంటెగా మాఱినది!

సిద్ధార్థుఁడు — అదియు రూపుచెడి గుఱ్ఱ మైనది!...

యశోధర — ఆ రూపము మాఱి వృక్షమైనది!...

సిద్ధార్థుఁడు — ఆ రూపముగూడ శిథిల మగుచున్నది!

యశోధర — దూదిపింజలుగ మాఱి చెల్లాచెదరగుచున్నది!

సిద్ధార్థుఁడు —

గీ. ఇట్లు ప్రకృతి ఘన మేఘమ్ము పగిదిఁ
జిత్రతరముగ నాకృతుల్ చెందుచుండి

యాలఘు నానాత్వ బోధకం బయ్యె, అంత
రమున నొక్కటే పరమకారణము దనరు.

యశోధర—అల్లదే ! సూర్యుం డస్తమింపఁ బోవు చున్నవాఁడు. మన మందందు నిలిచి చూచుచు మందిరముఁ జేరుటకుఁ జాల నాలస్య మగును. కావునఁ గొండ దిగుదము.
(లేచి యిరువురు దిగుట నభినయింతురు.)

సిద్ధార్థుఁడు—శైల స్రవంతులచే సంపోషితమైన యీ సరోవర మెంత రమణీయముగ నున్నదో చూడుము.

యశోధర—ఆపద్మిని యెంత సొంపువహించి యున్నది!

సిద్ధార్థుఁడు—పద్మిని నెడఁబాసి సాంధ్యకాషాయాంబర ధారియై చరమాద్రి సానువిపినంబులఁగూర్చి పోవువాఁ డీ భగ వానుడగు నినుఁడు.

యశోధర—చరమసీమను గూర్చి పోవు నినుని బోవల దని వేఁడుటకై పద్మిని తన యరవిందకరముల మోడ్చుచు న్నది. ... ఆహా ! ఈ సువర్ణచ్ఛాయ యెంత మనోహరముగా నంతరిక్షమున నావరించుచున్నది !

సిద్ధార్థుఁడు—బగితైనెఱి యాలయపు గోపురమునకుఁ బూసిన బంగిరు పూఁతయో యన రమణీయముగ నున్నది. చరమ సంధ్యకుఁ బ్రార్థనాంజలు లొసంగుదము. (ఇరువురు మోఁకాళ్లపైఁ గూర్చుండుదురు.)

తే. చిత్రవర్ణ పయోధరాంచిత నభంబు
చారుతర కాంతి పూరముల్ జాలువార్చ,
ఆందు స్నాతులౌ జనుల కానందమిచ్చు
చరమ సంధ్యకుఁ బ్రార్థనాంజలి ఘటింతు.

యశోధర—'చరమసంధ్యకుఁ బ్రార్థనాంజలి ఘటింతు.'

(ఇరువురును జేమోడ్పు గావించి నమస్కరించుచున్నారు.)

మనోనాథా! అదే చూడుఁడి.

తే. తమ మనెడి కాల విహగంబు తన విశాల
పక్షముల విప్పి తూరుపు వలనునుండి,
దిగులు జనిఁగొన్న, వేవేగ నెగిరివచ్చి,
నెలవుకొనియెడు ప్పుదు నిశానీడమందు.

సిద్ధార్థుఁడు—అంధకార మెంత శీఘ్రముగా నంతటను వ్యాపించె!

యశోధర—ఇంద్రజాలికురాలగు నిశీథినీ విలాసిని తన చీఁకటిమునుఁగుతో నైహికవస్తుజాతంబులఁ గప్పి పుచ్చి, తన వంచకత్వము ప్రకటము కాఁగ మన కన్నుల కలిమిని వ్యర్థపఱచుచున్నది!

సిద్ధార్థుఁడు—యశోధరా! అహస్కరుండె మహేంద్రజాలికుఁడు. అతఁడు తన కరకౌశలమున స్వర్గాది సద్వర్గమును గప్పి పుచ్చి, మన దృష్టుల నైహిక విషయములందుఁ బ్రసరింపఁజేసెను. అతఁడు చనఁగా వచ్చిన యీనిశీథినీ విలాసినియే మహోపకారిణి; ఇది మన దృష్టుల నైహికవిషయముల నుండి మరల్చి, స్వర్గము దిక్కునకుఁ ద్రిప్పి, సద్గుణమును జూపుచు, మన కన్నులను సార్థకత పఱచుచున్నది

యశోధర—నాథా! మనమిప్పుడు తమాలతరు వీథికి వచ్చినారము. చిమ్మని చీఁకటులు వ్యాపించి యుండుటచేతఁ గన్నులు గల్గు ఫలంబు పోయె. దారి కానరాదు.

సిద్ధార్థుఁడు—యశోధరా! నే నెన్నియో సారు లిట్లు వచ్చియుండి, రాత్రి మిక్కిలి యాలస్యముగా మందిరమునకు మరలుచుండువాఁడను. కావున నాకీ మార్గము లన్నియుఁ బరిచితములు. నా భుజము పట్టుకొని రమ్ము. (యశోధర యట్లు చేయును. ఇరువురును నడచుట యభినయింతురు.) ఇప్పుడు తమాలవీధికాంతరమునకు వచ్చినారము.

యశోధర—నిశ్శబ్దమై యెంత భయంకరముగా నున్న దీ యంధకారము!

సిద్ధార్థుఁడు—ఈ యంధకారము నాకు భిన్నముగ నున్నది. ఇది నిశ్శబ్దమై, గంభీరమై, మనోహరముగ నున్నది. ఇట్టి యంధకారముతో నేకాంతవాసము నడిపి, తత్ రహస్యోపదేశములు పడయు టెంత సుకృతము!

యశోధర—నాథా! పొగడల వాసన గొట్టుచున్నది.

సిద్ధార్థుఁడు—(నడచుచు)

చ. ఇది వకుళావనీజముల బృందము, చంపకవృక్షజాల మి
య్యది, యివి సింధువార నవహారము, శిరీషమహీజపాళి యి
య్యది, సహకారభూజతతు లయ్యవె, పుష్పితమల్లికాలతా
వితత విశాల మార్గ మిదె, నే నడుమంగను వచ్చునింకిటన్.

యశోధర—ఇరుపార్శ్వముల శుక్తిపంక్తు లుంచిన దారి చేరితిమి. నక్షత్రకాంతిచేత దారి తెల్లముగా నున్నది. అల్లవే! మందిరమునందలి దీపములు కనఁబడుచున్నవి! వడి వడిఁ బోవుదము.

(నిష్క్రమించుచున్నారు.)

---

రంగము 2. కపిలవస్తు పురము—రాచనగరు.

(శుద్ధోదనుఁడు, మంత్రి, గూర్చుండియుందురు.)

శుద్ధోదనుఁడు—ఈ నా స్వప్నమె నన్ను వ్యాకులపెట్టు చున్నది.

మంత్రి—జాగ్రదవస్థయందుఁ జిత్తమును స్వాధీన పఱచుకొన్న భావములే స్వాపావస్థయందు స్వప్నరూపమున, ఉద్బుద్ధము లగుచుండును. దీనికై వ్యాకులపా టేల ?

శుద్ధోదనుఁడు—తామరపాకు మీఁది జలకణంబువలె నంటక సంసారమందుండు సిద్ధార్థుఁడు, ఎప్పుడేని సంసారపరి త్యాగ మొనరించి యడవితెరువులఁ బట్టి, నాకల నిక్కల యని పించునేమో యని శంక వొడముచున్నది.

మంత్రి—యశోధరాదేవి నిండుచూలాలు గదా. కతి పయ దినములలో నామె పుత్రవతి యగును. సంసారబంధము లిట్లతిశయించుచుండ, ఆతఁ డెట్లు వానిం ద్రెంపుకొనఁ గలఁ డు? ఏల మీరు వృథా చింత చేసెదరు ?

శుద్ధోదనుఁడు—వైరాగ్య చిత్తునకుఁ బత్నీపుత్రాదులే జాగుపాస్రపదులు.

క. అతిజిజ్ఞాసానల ప్రే
రితమై కడు సంక్షుభించు హృదయాంబునిధిక
నతిసుతులను తీరంబులు
మితిఁ దప్పక యుంచఁగలవె మేరలయందున్?

మంత్రి—భటులను గన్నోఱంగి పగ లతఁ డెందును బో లేఁడు గదా. ఎందఱో విశ్వాసపూర్ణులగు కావలివాం

ద్రుండ, ఏ మార్గురకుఁ గాని తెలియ నసాధ్యమై యోజనార్ధ పర్యంతము వినఁబడునట్లు శబ్దించునట్టి యావరణ కవాటము లుండ, అతఁడు రాత్రిమాత్ర మెట్లు తప్పించుకొని పోఁగలఁడు? మఱియుఁ బంగ్వంధాదు లాతని దృష్టి పథమున రాకుండ సముచిత వ్యవస్థలను జేసినారము గదా. ఇంక శంకింపనేల?

శుద్ధోదనుఁడు---వాని శారీర నిర్బంధమే వాని మనో విజృంభణమునకుఁ గారణమైయుండును. ఇంకొక విశేషము. తాను బురమును బ్రజలను జూడవలెనని నిన్న నాకెఱిఁగించె. వాని యీ కోరికను దీర్పవలయునా కూడదా యని నా మనం బాందోళించుచున్నది.

మంత్రి---ఈ సహజవాంఛా తిరస్కారమువలన, అనర్థములు గలుగవచ్చును. కావున, అతని యీ యభీష్టమును నడుప యనుమతి నిచ్చుటయే సమంజసము. వృద్ధులు, రోగులు, కుంటులు, కురుపులు, చీఁకులు, వికలాంగులు, మున్నగువా రా ప్రాంత రాజవీధులఁ దిరుగాడకుండఁ జేసి, యూరేగింపు నడుపుదము.

శుద్ధోదనుఁడు---మౌహూర్తికులను విచారించి, యూరేగింపునకు మంచి ముహూర్తము నిర్ణయము చేయుము. వీధుల నలంకరింపఁ జేయుము. ఆ దినము పంగ్వంధాదులు వీధుల యందు రాఁగూడదని శాసనము ప్రకటించుము; భటులను వీధుల కిరుగడల నుండ నియమింపుము.

మంత్రి---తమ యాజ్ఞాముద్ర చేపట్టువాఁడ.

(నిష్క్రమించుచున్నారు.)

---

## రంగము 3. కపిలవస్తు పురవీధి.

(దేవదత్తుఁడు, మావంతుఁడు, నడుచుచు వత్తురు.)

దేవదత్తుఁడు—మిత్రమా! మావంతుఁడా! రేపు స్వారి వెడలుట యేనుఁగుపైఁ గాదఁట; రథము మీఁదనే యఁట. ఊరేగింపులులో ఏనుఁగులే యుండఁగూడదఁట. మఱియు, నా వలన మోస మేమైన జరుగునేమో యని జడిసి కాఁబోలు, నన్నుఁగూడ సిద్ధార్థునితో నుండఁ గోరినారు.

మావంతుఁడు—మీ రుండునట్లయిన, ఏనుఁగుమీఁదఁ గాక, రథముమీఁదనే స్వారి వెడలున ట్లేర్పాటయినదే మంచిది.

(ఘాంఘికుఁడు తప్పెట గొట్టుచు వచ్చును.)

ఘాంఘికుఁడు— (తప్పెట కొట్టుట నిలిపి) జనులారా! పౌరులారా! చెప్పునది బాగా వినండి. చెప్పినట్లు నడుచుకోండి. మహారాజుగా రిట్లు శాసిస్తున్నారు: రేపు సూర్యోదయం అయిన తర్వాత కొంచెం సేపటికే మన యువరాజులుగారు రాజవీధుల్లో రథంపైన స్వారి వేంచేస్తున్నారు. మీ రెల్లవార్లు పండగ వస్త్రాలు ధరించుకొని, అలంకారం చేయఁబడివుండే వీధులకు రెండు ప్రక్కలూ వరుసగా నిలిచివుండవలెను. రథం సమీపంగా రాఁగానే యువరాజుగారిపైన పూలు చల్లవలెను. మఱి ప్రకట ముఖ్యంగా వినండి: కుంటివాండ్లు, గుడ్డివాండ్లు, యాభై యేండ్లు మీఱిన ముసలివాండ్లు, రోగులు, ఇటువంటి వాండ్లెవ్వరూ రేపటిదినం తమ యిండ్లు విడిచి వీధుల్లో వుండఁ

గూడదు. ఇది మఱవకండో మఱనకండి. (తప్పెట గొట్టుచుఁ బోవును.)

దేవదత్తుఁడు—ఈ రాజశాసనపు రెండవ భాగమును ధిక్కరింపఁ గొందఱ నేర్పఱచి యున్నాను. సమయముచూచి వారు కుంటులను వృద్ధులను యువరాజు రథము ముందఱ నిలుపుదురు. మఱి నీ వేమి చేసెదవు?

మావంతుఁడు—ఊరేగింపులో ఏనుఁగులే యుండఁగూడదన, నే నేమి చేయఁగలను? ఉపాయ మున్నఁ జెప్పుఁడు; తప్పక చేసెదను.

దేవదత్తుఁడు—రాజవీధియందొక రహస్యస్థల మేర్పఱచి యున్నాను. అందుఁ గ్రొత్తగాఁ బట్టఁబడిన యడవి యేనుఁగును మత్తెక్కించి యుంచి, ఊరేగింపు అక్కడికి రాఁగానే, దానిని జనసమూహములోనికి వెడలఁగొట్టవలెను. గజము మత్తిల్లి, గొలుసులఁ ద్రెంపికొని, గజశాలనుండియె పరుగెత్తివచ్చిన దని చెప్ప, నమ్మనివా రెవ రుందురు?

మావంతుఁడు—ఇది మంచి యుపాయము.

దేవదత్తుఁడు— మిత్రమా ! ఇదిగో ! ఇప్పటికీ పారితోషికముం దీసికొనుము. (మెడలోని హారము నిచ్చును.)

మావంతుఁడు—(దానిని బరిగ్రహించి) ఈ రాత్రియే యా యడవి మదపు టేనుఁగును ఆ తావునకుఁ దెత్తును.

దేవదత్తుఁడు— మిత్రమా ! ఈ పురాలంకారములు ధ్వంసమగునట్లు చేయవలెను. జనశ్రేణులు ఏనుఁగుల యూరే

గింపు చూచుటకై యేర్పడినట్లు దృశ్యమును మార్చవలెను.

మావంతుఁడు—అది యెంతపని!

(నిష్క్రమించుచున్నాఁడు.)

దేవదత్తుఁడు—ఒక్కపీనుఁగు పడెనా దాని నెట్లయి నను సిద్ధార్థుని కంటఁ బడఁజేసి, నేను వానికిఁ జెప్పవలసిన దంతయుఁ జెప్పెదను. ... ఆహా! దుండగీండ్లును, లంచగొం డ్లును లోకమున నుండుట యెంత మేలు!

(నిష్క్రమించుచున్నాఁడు.)

---

రంగము 4. కపిలవస్తుపురమందలి రాజవీధి.

(జనులు, భటులు, వీధి కిరుగడల బారులుదీరి నిలిచియుందురు. భటనాయకుఁడు వీధిలో నటునిటు దిరుగుచుండును.)

భటనాయకుఁడు—(భటులతో) జనుల నెవ్వరిని నొక వైపునుండి మఱియొక వైపునకుఁ బోనీకుఁడు. కుంటులు, కురుపులు, అంధులు, ముసలులు, కుష్ఠరోగులు, వికలాంగులు, సన్న్యాసులు నెందైనఁ గానవచ్చిన, వారిం గొట్టి దూరము తఱిమి వేయుఁడు. మెలఁకువతో మెలఁగుఁడు. రథము వచ్చు సమయము సమీపించుచున్నది. (చేఁత కఱ్ఱలు చంకలందుఁ గలిగిన కుంటివాఁడు ప్రవేశించి గుంపులోఁ దూఱును.)

భటులలో నొకఁడు—కుంటివాఁడు! కుంటివాఁడు! వానింబట్టుఁడు, కొట్టుఁడు, నెట్టుఁడు. (భటులు వానిం గొట్టుదురు.)

కుంటి—అయ్యో! అయ్యో! నన్నేల కొట్టి చంపు దురు? కుంటివాఁడు యువరాజుం జూడఁ గూడదా? వాని కన్నులు మీ కన్నులవంటివి గావా?

భటులు—కూడదు, కూడదు; కుంటు లిక్కడికి రాఁగూడదు.

(వానిం గొట్టి గెంటుదురు.)

కుంటి—మీ యువరా జడవులపాలు గానీ! (అని తిట్టుచుఁబోవును. జను లొండొరులతో)

ప్రథముఁడు—(ద్వితీయునితో) కుంటి కుదుపులు, వృద్ధులు, వికలాంగులు, రాజవీథులందు నేఁడు రాఁ గూడదని చాటగా నేనును వింటిని. అయ్యా! రా జట్లు కఠినముగ శాసింపఁ గారణమేమి?

ద్వితీయుఁడు—యువరాజుగారు మిక్కిలి యనుకంపామతులు, ఆత్మ పరిత్యాగశీలురు, తత్త్వార్థాన్వేషణపరులు. కుంటి కుదుపులను, వృద్ధులను, వికలాంగులను, జూచినచోఁ జింతకు లోనయి, యిహలోక వ్యవహారములను నాతఁడు పరిత్యజించునేమో యను శంకచే నిట్టి శాసనము చేయఁబడినది. ...అయ్యా! మీ దేయూరు?

ప్రథముఁడు—అయ్యా! మాది కౌశాంబీనగరము. సూర్యరశ్మికై వెనఁగులాడునట్టి యంకుర మెన్నాళ్లు నేల డాఁగి యుండును?

(వాద్యఘోష. సిద్ధార్థుఁడును దేవదత్తుఁడును, గూర్చుండి, చెన్నుఁడు రథ చోదకుఁడై యున్న రథము ప్రవేశించును.

జనులును భటులును రథమువంకఁ జూచుచుండ నూఁతకఱ్ఱ పట్టుకొన్న వృద్ధుఁ డొకఁడు (ప్రవేశించి గుంపులోఁ దూఱును.)

ద్వితీయుఁడు—(ప్రథమునితో) ఛత్రము క్రిందనున్న యాతఁడే యువరాజు. లుంబినీవనమునఁ బలాశవృక్షముక్రింద మాయాదేవి యీ మహానుభావుని బ్రసవించినప్పుడే యది తన కొమ్మలను వంచి నికుంజముగా నేర్పడెను. ప్రక్కన నున్నవాఁ డాతని పినతండ్రి పుత్త్రుఁడు.

ప్రథముఁడు—ఓహో ! ఎంతటి మహాత్ముఁడీ యువరాజు ! ఆ సౌమ్యాకారము, ఆ ప్రసన్నవదనము, ఆతని మాహాత్మ్యముం జాటుచున్నవి.

జనులు—జయము!జయము! యువరాజునకు జయము! జయము ! (పూలు చల్లుదురు).

(వృద్ధుఁడు ప్రవేశించును.)

వృద్ధుఁడు ! వృద్ధుఁడు ! వృద్ధుఁడు !

భటులు—వానిం బాదుఁడు, మోఁదుఁడు; దంచుఁడు, త్రుంచుఁడు. (అని గుమిగూడి వృద్ధుని గొట్టుదురు.)

సిద్ధార్థుఁడు—చెన్నా ! రథము నిలుపుము. అం దేటికో సంక్షోభముగ నున్నది. (సిద్ధార్థుఁడు, దేవదత్తుఁడు, రథము దిగి యల్లరియైన చోటికి నడతురు.) భటులారా ; మీ రేల యి ట్లితనిఁ గొట్టుచున్నారు ?

భటులు—(కొట్టుట నిలిపి) యువరాజా ; వీఁడు రాజశాసన మతిక్రమించినాఁడు.

వృద్ధుఁడు—ఇక్కడికి వచ్చినందున నన్ను వీరు కొట్టుచున్నారు యువరాజా ! రక్షింపుము, రక్షింపుము.

సిద్ధార్థుఁడు—(దేవదత్తునితో) వీరు చెప్పునది నాకర్థము కాలేదు. రాజశాసన మేమి? ఇతఁడెట్లు దాని నతిక్రమించెను?

దేవదత్తుఁడు— నీవు స్వారి వెడలు సమయమున ముసలులు, కుంటులు, చీఁకులు, రోగులు మున్నగువారు వీథుల నుండఁగూడదని రాజశాసనము.

సిద్ధార్థుఁడు—అట్లగునా? ఇట్టివారిం గనులారఁ జూచు భాగ్యము నాకింతవఱకుఁ గలిగియుండలేదు. అయ్యా ! నీవు నాకుఁ గడు దర్శనీయుఁడవు. అయ్యో ! ఆపాదమస్తకము వడఁకుచున్న దే? నోటఁబండ్లు లేవు. లాలాజలము కాఱుచున్నది. అయ్యా! ఈ వస్త్రముతో నోరు గడ్డము తుడిచికొమ్ము. నేనే తుడిచెదను. (తుడువఁబోవును.)

వృద్ధుఁడు— వలదు, వలదు. (వస్త్రముం గైకొని తానే తుడిచికొనును.)

జనులు—ఈ వృద్ధుని దెంత పుణ్యము !

సిద్ధార్థుఁడు—అయ్యా ! నీవు జనించి యెన్నేండ్లాయె?

వృద్ధుఁడు—తొంబది యేండ్లాయె.

సిద్ధార్థుఁడు—ఇంతవయసు రాఁగ నా జనకుఁ డిట్లగునా! నే నిట్లగుదునా! యశోధర యిట్లగునా?

దేవదత్తుఁడు—అందఱు నిట్లగుదురు.

(నేపథ్యమున "ఏనుఁగు ! ఏనుఁగు ! మత్తిల్లినది ! మత్తిల్లినది ! అయ్యో ! త్రొక్కె ! త్రొక్కె !" యని కలకలము.)

సిద్ధార్థుఁడు—అయ్యో ! బాలుని ద్రొక్కెఁ ద్రొక్కె!

దేవదత్తుఁడు—ఎదమీఁదనె ద్రొక్కెఁగా !

జనులు—అయ్యో ! చచ్చెఁ జచ్చె !

దేవదత్తుఁడు—భటులారా! ఆ బాలకు నిటఁ దెండు.

(భటులు బాలకుని నెత్తుకొని వత్తురు.)

సిద్ధార్థుఁడు—బాలకా ! బాలకా ! ... మాటాడుము. (చుబుక మంటుచు) ఏల మాటాడవు ?

దేవదత్తుఁడు—సిద్ధార్థా ! ముట్టకు, ముట్టకు.

సిద్ధార్థుఁడు—ఏల ముట్టఁగూడదు? ఈ చిన్నారి పొన్నారి బాలకుని ముట్టఁగూడదా ! నాయనా ! నాయనా ! నీకేమైనది చెప్పుమా. నీ బాధ చెప్పుమా.

దేవదత్తుఁడు—సోదరా ! ఆ బాలకుం డింకెట్లు పలుకును? వాఁడు మృతుఁడు. అది పీనుఁగు. ముట్టవలదు.

సిద్ధార్థుఁడు—ఏమీ ! మృతిచెందినాఁడా? మృతియనఁగా నేమి? దేనికి మృతి? ~~నేనును మృతి చెందుదునా? నా తండ్రియు మృతిపొందునా? యశోధరయు మృతిపొందునా ?~~

~~దేవదత్తుఁడు—ప్రపంచమునఁ బుట్టినవారి కెల్లరకు మరణము ధ్రువము.~~

భటనాయకుఁడు—భటులారా ! ఈ బాలకుని దీసికొని పోయి, వాని తల్లిదండ్రుల కొప్పగింపుఁడు.

సిద్ధార్థుఁడు— (బాలకుని చుబుక మంటి) బాలకా! నా నిమిత్తముగదా నీ కీ యపమృత్యువు సంభవించె. నీ తల్లిదండ్రు లెంత దుఃఖింతురో ! వారి దుఃఖము మాన్పు నుపాయ

మున్నదా? (ఆలోచించుచుండ, భటులు కొందఱు బాలు నితోఁ బోవుదురు.)

దేవదత్తుఁడు—సోదరా! రథారోహణము చేయుదము. (ఇరువురు నట్లు చేయుదురు.)

సిద్ధార్థుఁడు—చెన్నా! పురమంతయుఁ జూచితిని.... కాదు, కాదు. ప్రపంచము నంతయుఁ జూచితిని. ఇంక రథమును జక్కఁగ మందిరమునకు నడుపుము.

చెన్నుఁడు—తమ యాజ్ఞ.

(రథము పోవఁగాఁ దెరపడును.)

---

# గౌ త మ బు ద్ధుఁ డు

## చతుర్థాంకము.

రంగము 1. కపిలవస్తుపురము. యశోధర శయ్యాగృహము.

(యశోధర పర్యంకముపై నిద్రించుచుండ, సిద్ధార్థుఁడించుక దూరమునఁ బీఠముపైఁ గూర్చుండి యుండును.)

సిద్ధార్థుఁడు—ఎంత దుఃఖమయ మీ జగత్తు! నేను బురసందర్శనము చేసిన మూఁడు గడియలలోనే యెంత దుఃఖముం జూడఁ గలిగితిని! లోకమున నెలకొనియున్న యీ దుఃఖమును నే నెట్లు శమింపఁ జేయుదును?

ఈ దుఃఖమునకు మూలకారణం బేమి? జనన మరణంబులె గదా. జనన మరణ పరంపరకు నివృత్తిఁ గలిగించిన సర్వదుఃఖ నివృత్తి యగునుగదా! జనన మరణ రాహిత్య మెట్లు చేకూఱు? దీనికి సాధనమేమి? ఈ సాధనమే యన్వేషింపఁ దగినది.

యశోధర— (ఉలికిపడి లేచి) నాథా! నాథా! ఎందుఁ బోయితి రెందుఁ బోయితిరి?

సిద్ధార్థుఁడు— (సమీపించి) యశోధరా! ఏమి! నే నిక్కడనే యున్నాను.

యశోధర—(వణఁకుచు గుండెపైఁ జేయిపైచికొని) నేనొక ... దుస్స్వప్నము ... గంటి. దానిఁ ... జెప్పుటకు ... నోరాడ ... కున్నది.

సిద్ధార్థుఁడు—యశోధరా! సంబళించుకొనుము. ధైర్యము దెచ్చుకొమ్ము.

యశోధర— (వణఁకుచునె) మన మిరుపురము ... పురవీధిని ... నడచుచుండ ... నొక బెదరిన .. యాఁబోతు ... అంకెవేయుచు ... ఎదురుపడినవానినెల్లఁ ... దన కొమ్ములం జిమ్ముచుఁ జెనుభూతమువలె వచ్చి ... మిమ్ములఁ ... దఱుముకొని పోవుచుండెను. అప్పుడు ... నే నడ్డముపోయి ... దాని నాఁపఁ ... బ్రయత్నించితిని.

సిద్ధార్థుఁడు— ఎంతటి యనురాగము!

యశోధర—అంత ... ఆ వృషభము .. నాపైకి ... ఆక్రోశించుచు వచ్చి ... నన్నుఁ గుమ్మి ... హా! ... నామెడలోని హారములం ద్రెంపివేసి ... నన్ను దూరమునఁ ... జిమ్మివైచెను.

సిద్ధార్థుఁడు—ఎంత దయలేని దా యాఁబోతు! అటుపిమ్మట?

యశోధర—అటుపిమ్మట ... భూమి కంపించెను; ఉయ్యేలవలె నూగెను. వనములు, ఉద్యానవనములు, ఇండ్లు, మేడలు, ... నేలకుఁ గ్రుంగెను.

సిద్ధార్థుఁడు—అనంతరము?

యశోధర—అప్పుడు మీరొక బక్షివాహనము మీఁద, ఆకాశమార్గమునఁ బోవుచుంటిరి. అంత నేనుబడియున్న భూమి యుత్తుంగ శైలమై, పై కుబికి, మీదిక్కునకు రాఁగఁ, బక్షివాహనముపైఁ బోవుచున్న మీరు, నన్ను లేవనెత్తి

మీ వాహనముపై నెక్కించుకొంటిరి. అంత మెలకువ గలిగెను.

సిద్ధార్థుఁడు—యశోధరా! ఈ కల చెడ్డదిగాదు; మంచిదే. ఐహికవస్తువులు నశ్వరంబు లనియు, మన మచిరకాలముననె యుత్తమమైన యున్నతస్థితిఁ బొందనున్నార మనియు, ఈ స్వప్నము సూచించుచున్నది.

యశోధర—జీవితేశ్వరా! అంతటికిని మిమ్ములనే నమ్ముకొని యున్నదానను. మీతోడిదే నాకు లోకము. నాకు నవమాసంబులు నిండుచున్నవి. మఱియు గర్భమందు నెలకొని యున్న మీ తేజ స్సనతికాలముననె పుత్రరూపమున నుదయించి, మనల నానందవార్ధి నోలలాడించును.

సిద్ధార్థుఁడు—పుత్రోదయమువలన నీ భాగ్యము పండును; నాకు ముక్తిగతి కలుగును. (వాతాయనము గుండఁ జూచి) యశోధరా! అదే చూడుము.

గీ. పూర్ణగర్భ భారమ్మునఁ బొల్చు పూర్వ
దిక్సతీ పాండుర కపోల దీప్తు లొలసి
గగన భాగంబుపైఁ గడుఁగాంతి నెసఁగ
బల్లు మని యంతటను నిదే తెల్లవాఱె.

యశోధర—ఇంక వెలికిఁ బోవుదము.

(నిష్క్రమించుచున్నారు.)

---

రంగము 2. కపిలవస్తుపురము. విశ్రామవనము.

(సిద్ధార్థుఁడు పద్మాసనస్థుఁడై యాలోచించుచుండును.)

(నేపథ్యమున)

మం. ద్వి. వినువీధి హాయిగా విహరించుఖగము !
వాలితివ వేలొకో వసుధపై నిట్లు ?
సంసారమనియెడి జలధిలోఁ బడెదు ;
బుద్ధిసూత్రము తెగిపోయెనే నీకు ?
భక్తిపక్షబలంబుఁ బైకొనఁజేసి
యరివర్గ మనెడి జంఝూనిలంబునకుఁ
జిక్కి చేడ్పడకుండ జృంభించి యెగసి
విష్ణుపదంబును వేడ్కమై గనుమ!

సిద్ధార్థుఁడు—(గీతము విని) సౌధాగ్రమందలి యా రామామణి పాడిన యీగీత మెంత మధురముగ నున్నది! దీని యందలి ప్రతిశబ్దంబును నా మనోవీణా గుణముల స్పృశించి వైరాగ్యరాగ ముదయింపఁ జేయుచున్నది.

చిత్ర—(ప్రవేశించి) గౌతమీదేవియు, మహారాజు గారును నా కిట్లాజ్ఞాపించిరి: 'చిత్రా ! పుత్రోదయ శుభవార్త సిద్ధార్థునకుఁ జెప్పి, యాతని మనోవైఖరి గ్రహించి మాకెఱిఁ గింపు' మని. ఈ పని నెఱవేర్చుటవలన నాకేమైన బహుమతి లభింపకుండునా ? ఏమి నా యదృష్టము ! అదిగో ! రా కుమారుఁడా చెట్టునీడఁగూర్చున్నవాఁడు. ఆయనమెడలోని యే హారము నాకంఠము నలంకరించునో ! ఆలస్య మేల ? పోయి యీ శుభవార్త నెఱిఁగించెదఁ గాక. (సిద్ధార్థుని సమీపించి)

జేజే! యువరాజా! యశోధరాదేవి పురుషశిశువును నేఁడుద యమున శుభముహూర్తమునఁ బ్రసవించెను.

సిద్ధార్థుఁడు—ఇది యొక రాహులము-ఆతంక ముద్భవించినది. సరే.

చిత్ర—గౌతమీదేవియు, శుద్ధోదన మహారాజుగారును ఈ శుభవార్తను దమ కెఱింగింప నన్నుఁ బంపినారు.

సిద్ధార్థుఁడు—'ఎఱిఁగించితి' నని వారితోఁ జెప్పుము.

చిత్ర—యశోధరాదేవియుఁ దమతోఁ జెప్పు మనెను.

సిద్ధార్థుఁడు—సరే. ... .. ఇం కేమి?

చిత్ర—నేఁ బోయి వత్తునా?

సిద్ధార్థుఁడు—మంచిది. రాహుల ముద్భవించినదే! ఏమి గతి?

చిత్ర-(మాటి విఱుచుకొనుచుఁ గొంత దూరముపోయి) కొండంత యాసపెట్టుకొని వచ్చితినే. నా కేమియు లభింపలేదే! నా తోడి సేవకురాండ్రు కానుక యేమి తెచ్చితివని యడుగ నే నేమని వారితోఁ జెప్పికొందును? అయ్యో! ఎట్టి యవమానమునకు గుఱియైతిని! ... ... రాహుల ముదయించిన దఁట. వీని నోటినుండి యీ వెడలిన నిరుత్సాహపు విఱుపు మాటలు దేవికిని, పతికిని నేఁజెప్ప వా రెంత సంకటపడుదురో. అక్కటా! ఈ యరిష్టపుఁ బనికి నన్నేల నియమించిరి? రాజాజ్ఞ నెఱనేర్పక తప్పదు గదా. కానీ, నన్నవమాన పఱచిన వీనికి నేను బ్రతిక్రియ చేయఁ జాలకుందునా?

(చిత్ర నిష్క్రమింపఁగాఁ దెరపడును.)

---

రంగము 3. కపిలవస్తు పురము. యశోధర శయ్యాగృహము.

(యశోధర తన శిశువుపైఁ జేయి వైచికొని పల్యంక మున నిద్రించుచుండును. సిద్ధార్థుఁ డించుక దూరమునఁ బీఠ ముపైఁ గూర్చుండి యుండును.)

సిద్ధార్థుఁడు—(ఆలోచించుచు) ఈ లోకమున నే నేల జన్మమెత్తితి? జ్ఞానదారిద్ర్యోపహతులై, ధర్మపదభ్రష్టులై, అధః పతితులై, నిరంతరము దుఃఖభాజను లగు మానవుల నుద్ధరించుటయ మదీయ కర్తవ్యమని నా యంతరాత్మ బోధించుచున్నది. సకల భోగంబు లనుభవించుచు రాజనై యీ సంసారమం దుండుపక్షమున నే నెట్టి మానవ సేవనేని చేయఁ జాలుదునా? రాజ్యాధికార ప్రాప్తివలన రాజ్య తృష్ణ యధికము కాఁగఁ బ్రజాపీడనము గావించి, రాష్ట్ర ధన కోశమును, సైన్యమును, ఆయుధాది మారక పరికరములను, నభివృద్ధి చేయఁ జాలుదును; మఱియు యుద్ధములు నడిపి, జన ధన నాశనము చేయఁ జాలుదును. అంతియ కాని, ప్రజల నైహికాముష్మిక సంపదార్జనమునకు లేశమైనను నేను బ్రయోజన పడఁ జాలుదు ననుట దుర్లభము. అట్లగుట దురిత ప్రాప్తికి హేతుభూతమగు రాజ్యాధిపత్యము వహించి, ప్రజల దుఃఖ పెట్టనేల? నేనును దుఃఖపడనేల? నేను బుత్ర సంతానముం బడసి, గృహస్థాశ్రమ స్వీకార పూర్ణ ఫలముం బొందినాఁడను. కావున గృహపరిత్యాగమే కరణీయము.

ఎఱిఁగి యెఱిఁగి యింకను నాలసింప నేల? ఈ రాత్రియే గృహపరిత్యాగ మేల కూడదు?

ఆఁ! ఇట్టి సుదిన మెప్పుడు వచ్చునని కదా యెన్నియో దినములుగ నిరీక్షించుచున్నాఁడను. ఏ ప్రభుత్వములు దమ చమూసమూహములను బరరాష్ట్రములపై నడిపి, వానిని శత్రు రక్తవాహినీ చిహ్నితములనుగాఁ జేసి యాక్రమింప నుత్సుకత లూగుచుండునో, ఏ ప్రభుత్వములు స్వార్థ ప్రేరితములై యన్యజనపద ధనాధ్యక్షీనములఁ బిలికి పీడించుచుండునో, యట్టివానిపై శాంతిరసాసారంబులఁ గురియించి, యందుఁ జెలరేఁగుచున్న తృష్ణాపరాగంబు నణఁచువాఁడ. అట్టి పనికి వలయు సాధనాన్వేషణార్థమై యీ నా ప్రాభవంబుఁ బరిత్యజించి, తల్లి దండ్రుల విడనాడి, పత్నీ పుత్రులం దెగడి, సుఖమును దిరస్కరించి, విశ్వ ప్రపంచ మిల్లుగా, అంతరిక్షమే వితానముగా, తరుచ్ఛాయలే పవన మందిరములుగా, కటికి నేలయే పాన్పుగాఁ జేకొనఁ బోవువాఁడ. ప్రకృతి యొసంగు రహస్యోపన్యాసములు విని, మననము చేసి, వానియందలి పరమార్థమును మహాత్ముల పాదముల చెంతఁ గూర్చుండి గ్రహించి, లోకోద్ధరణంబునకై వినియోగించువాఁడ.

ఓ దేవతలారా! బుద్ధులారా! (మోఁకరించి) ఈ నా యుద్యమంబునకుఁ దోడ్పడుఁడు; మిమ్ములఁ గడుభక్తి వేఁడువాఁడ. (ధ్యానము చేయును. లోపలఁ దలుపులు తెఱచినట్లు గొప్ప శబ్దమగును.)

ఓహోహో! నేను బుద్ధదేవులచే ననుగ్రహింపఁ బడితిని! (కన్నులు తెఱచి) ఆహా! భవన మంతయు గాఢ నిద్రం దేలుచున్నది! భూరి కవాటము లన్నియుఁ దెఱవఁ బడియున్నవి!

అల్ల దే! మదీయ జన్మనక్షత్ర ముదయించి, లోకోద్ధర ణోపాయము నన్వేషించుటకై, గృహ పరిత్యాగ సమయ మాసన్న మైనదని నాకుఁ గనుసన్న చేయుచున్నది! ఓ నక్షత్రమా! ఇదే తరలెదను.

(దుఃఖముతో) హా! ఎంత ధైర్యమున్నను, ఎంత నిశ్చయ మున్నను, అయ్యవి కన్నులఁ గ్రమ్ము నశ్రుజలంబుల నిరోధింపఁజాలకున్నవి. ఆహా! పితృ పుత్ర కళత్రాభిజన పరిత్యాగ మెంత దుస్సహము!

ఏల నా చిత్త మిట్లు కళవళ పడుచు సంసార వ్యామోహమునఁ దగుల్కొనుచున్నది? సంసార వ్యామోహముననే కాలమంతయుఁ గడపినచోఁ దత్త్వాన్వేషణము చేయు టెప్పుడు? ఆయువు ఝరీవేగతుల్యము, శరీరంబు బుద్బుదప్రాయము, యౌవనము కాదంబినీ తటిల్లతా తరళము, వార్ధకము రోగ భూయిష్ఠము, సంసార మున్ననో యపారంబు. సంసారము నిస్తరించు సాధనముం బడయుటకుఁ బ్రశాంతప్రదమై, సంతుష్టికి నిదానంబైన సన్న్యాసాశ్రమ స్వీకారంబె ప్రకృత కర్తవ్యము.

అక్కటా! సన్న్యాసం బే నెట్లు స్వీకరింతు? సంసారం బే నెట్లు పరిత్యజింతు? యశోధరా గుణరూప విలాస లావణ్యము లే కారాగార కుడ్యములై నన్ను బందీభూతుఁ గావించినవే! కుమారునిమీఁది వ్యామోహమే శృంఖలాబంధమైనదే! ... కట్టా! తన తండ్రి చేయునది యేమని యెఱుంగక, మాతృ పర్యంకమునఁ బొత్తుళ్లలో సుఖముగఁ బరుండి నిద్రించుచున్న యీ చిన్నారి పొన్నారి చిఱుతపాపని నే నెట్లు విడనాడుదును?

తన పావన మధుర దృగ్విలాసముల నా హృదయమును దివ్యుచు చున్న యీ శిరీష సుకుమోమలిని, ఈ నా యర్థాంగలక్ష్మిని, ఈ నా సహధర్మచారిణిని నే నెట్లు పరిత్యజింతును?

అయ్యో! నే నెంత భ్రాంతిపరుండ? ఈ మోహార్ణవ మధ్యంబునఁ జిక్కి, యధైర్యమునఁ బెనఁగులాడుచున్నాఁడను. మోహంబున రాగంబు, రాగంబునఁ గామంబు, కామంబునఁ గ్రోధంబు, క్రోధంబునఁ దృష్ణయు వర్తిల్లుఁగదా. ఇంకఁ దృష్ణవలనఁ గలుగు దుఃఖంబులం బరిగణింపఁ దరమా? సర్వదుఃఖ జలసత్వాకీర్ణంబగు మోహార్ణవంబును సంతరించు టెట్లు? విమల వైరాగ్య ప్లవమున నే దీని సంతరింప వలయును.

ఓ విమల వైరాగ్యప్లవమా! దూరము చనక నా కగపడుము. మోహార్ణవమా! ఉత్తుంగ తరంగాకులంబవు గాకుము ... ... అక్కటా! ఏమి యొనర్చినను మానక మోహార్ణవంబు పొంగి, పొరలి, తెరలెత్తి విజృంభించుచున్నదే! బాష్పంబుగూడఁ బూర్ణముగ నావరించి విమల వైరాగ్య ప్లవమును మదీయ దృష్టినుండి మఱుఁగుపఱచుచున్నదే! ఓ యనురాగ పవమానమా! విసరుము, విసరుము; తనివితీర విసరుము. కాని, యనుకూలముగ మాత్రము విసరి దృఢతర వైరాగ్య ప్లవమును నాదరిఁ జేర్చి నా యధీనముఁ జేయుము. జ్ఞానభానూదయమా! దేదీప్యమాన ప్రభలతో నీవు ప్రభవించి, సంఛన్న బాష్ప పటలముం దొలఁగించి, నా ప్రయాణమును సుకరంబుగఁ జేయుమా.

ఆ ! శిశుశిఖామణి స్మితము సల్పుచున్నవాఁడు ! ఈ నవ్వు వెన్నెల నా హృదయమున కెంత చల్లఁదన మొసంగు చున్నది! రాహులా! నీ నెఱపు స్మితజ్యోత్స్నయే నాకు శుభ నిమిత్తము. చిన్నికుమారా ! నిన్నెత్తికొని కడసారి మనసార ముద్దాడనిమ్మా. (బిడ్డనిజూచి) అయ్యయ్యారే! యశోధర బిడ్డ నిపైఁ జేయివైచి యొత్తిగిలి పరుండియున్నదే ! చేతిని దొలఁగించుచో యశోధర మేల్కొని యశ్రుధారాకుల నేత్ర యుగళయై నా పాదములఁ బడి తన్ను విడనాడి పోవలదని బతి మాలి, నాహృదయంబును గరంచి నా యుద్యమమునకుఁ దప్పక భంగము గలిగించును.

చిన్నికుమారా! యశోధరా! ఇంతనుండియే మీ సెలవు గైకొనువాఁడ. పోయి వచ్చెద. కాదు పోయెద—

ఓ తల్లిదండ్రులారా ! నా యందు మీకుఁ గల పుత్ర వాత్సల్య మనిర్వచనీయము. మిమ్ము విడనాడు నన్నుఁ బితృ భక్తిశూన్యునిగను, కృతఘ్నునిగను, నృశంసునిగను, భావిం పకుఁడీ ! మీ కిదే యంజలి ఘటించెద.

హా ! యశోధరా ! హా ! మధుర స్వభావా ! హా ! కరుణామయమైన హృదయా ! హా ! మదీయ హృదయాంత రాళ నిష్కళంక శశాంకా ! ఇంక నీపజ్జ విహార శయ్యపైఁ బరుండను జుమా. నీ సురభిళ ముఖగంధపానము చేయను జుమా. (అంజలితోఁ బర్యంకమునకుఁ బ్రదక్షిణము చేసి) ఇదే నా కడసారి నమస్కారము. (అని నమస్కరించి లేచి)

ఓ గృహారామవనములారా ! శారికాకీరములారా! బంధు వులారా ! తలిదండ్రులారా ! పుత్ర కళత్రములారా !

నాకూర్చు వియోగదుఃఖమును సైరించి నన్ను క్షమింపుఁడు. ఇదే పోవుచున్నాను.

(అంజలితోడనే నిష్క్రమించుచున్నాఁడు.)

---

రంగము 4. కపిలవస్తు పురమందలి వీధి.

చిత్ర—(ప్రవేశించి) సిద్ధార్థుఁ డిట్టివాఁ డగునని నే నప్పుడే కనుఁగొంటిని ఇట్టివాఁడు గాకున్న నాఁ డట్లుండునా? ఆనాఁడు పుత్రోదయవార్త నే నాతనికిఁ జెప్పఁగా, అప్పుడు, రాహులుము—ఆతంక ముదయించినదని గొణఁగుకొని నన్నొక బహుమానముచేతనైన నను నాదరింపక బెల్లముఁగొట్టిన రాయి వలె నూరక కూర్చుండి యుండలేదా ? సంసారమందాసక్తిలేక సన్న్యాసివలె నప్పుడే యుండెను. కొందఱేమో యితఁడు మరలి వచ్చునని యాసపడుచున్నారు; కాని, నాకేమో వీఁడు పోయినపోకడనే పోయెనని తోఁచుచున్నది. ఆశ్వికులును, చారులును, వీనిని దేరఁబోయి యున్నారుగాని, వారెవ్వరును వీనిని దేఁజాలుట యెన్నఁటికిని బొసఁగదు.

రాజబంధువు లందఱు యశోధరా మందిరముఁజేరి మిక్కిలి దురపిల్లు యశోధరను, మహారాజును, గౌతమీదేవిని నూఱడించుచున్నారు. యశోధర శోకమే తీవ్రముగ నున్నది. శుద్ధోదనమహారాజు కన్నతండ్రి. మగవానికి మనస్సులోనే దుఃఖము; కాని, యిదెంతకాల ముండును ? కాలపురుషుఁ డంతయు మాయించును. ఇంక గౌతమీదేవి దుఃఖమా ? ఈమె సిద్ధార్థుని సవతి తల్లి. అయినను సిద్ధార్థునికిఁ జన్నిచ్చి

పెంచినది. ఈమె దుఃఖము నిజమై యుండునా ? తన కొమారుఁడు నందుఁడు యువరాజగు ననుసంతోష మామెకులోలోన లేకుండునా ? ఈమె దాసి యగు నాకే నందుఁడు యువరాజగుట తలపోసిన, ఎంతో యానంద మగుచున్నది. ఒకవేళ ఈమెకు నిజముగ దుఃఖమున్నను, అది యెంత కాల ముండును? ఒక రేడ్చుట చూడఁ దన కేడ్పు వచ్చుట స్త్రీజనస్వభావము. నేనును నట్టి యేడ్పు నేడ్చితిని. ఏడ్చుచుండినను గౌతమీదేవి నన్నుఁ బిలిచి "చిత్రా! నందకుమారుఁడు అమృతభవనమున నిద్రించుచున్నాఁడు. వాని నిక్కడకుఁ దోడ్కొని రమ్ము" అని నాతోఁ జెప్పెను. నందుని జూపి తన నాథుని శోక మడఁప నీమె యిట్టి యుపాయముం బన్నినది. నా మనస్సెట్లో యీమె మనస్సు నట్లే యుండును.

(ముందుఁ జూచి) అహో! దేవదత్తుఁ డీ దారినే వచ్చుచున్నాఁడు. ఈ సంగతి యతనికిఁ దెలిసియుండదు. ఇంతలో నితని కెవరు చెప్పువారు ?

దేవదత్తుఁడు—(ప్రవేశించి) చిత్రా! ఎక్కడఁ బోవుచున్నావు ? నగరులో నుదంత మేమి ?

చిత్ర—ఊరెల్ల నుమ్మలించుచుండఁగా, ఉదంత మేమి యని యడుగుచున్నావే ?

దేవదత్తుఁడు—సిద్ధార్థుఁడు సన్న్యాసికాఁగనెంచి గృహము విడిచి పోయియుండుట నాకును దెలియును. అది గాదు నే నడుగుట. యశోధరస్థితి యెట్లున్నది ?

చిత్ర—ఆమె శోకమున మునిఁగియున్నది.

దేవదత్తుఁడు—నన్నుఁ బెండ్లాడియుండిన, ఇట్టి దుఃఖములేక సుఖలీలఁ దేలుచుండెడిదిగదా ? ఇప్పు డేమాయె ? చిత్రా ! దీనిం గైకొనుము; ఒక్క యుపకారముం జేయుము. (తన కంఠహారము నిచ్చును.)

చిత్ర—(దానిం గైకొని యొడిలో దాఁచి) రాకుమారా ! నేఁ జేయవలసినదేమి ?

దేవదత్తుఁడు—సిద్ధార్థుఁ డిఁక నురలఁడు. యశోధర శోక మాదినమున కాదినము మాసిపోవును. అది యొంటి పాటున నున్నప్పుడు, సమయముచూచి, నయముగా దాని ముందఱ నన్నుఁ బొగడి, నాపై దానికి మోహము గలుగునట్లు చేయుము. అది సాధ్యపడదేని, నా చేతులలోనికి దాని నర్పించు నుపాయమైనఁ జేయుము.

చిత్ర—రాకుమారా ! ఇది యెంతపని ? ఆమె దుఃఖము కొంత చల్లఁబడనీ. నీవు చెప్పినట్లు చేయుదును. మరల నిన్నుఁ గలిసికొందును. (నిష్క్రమించుచున్నది.)

దేవదత్తుఁడు—స్వయంవర దినముననే నాకు భార్యగా వలసి యుండెఁగదా యిది. ఇప్పుడు దీనిని గైవసము చేసికొనక పోనిత్తునా ? పన్నుఁగడ లన్నియుఁ బన్నెదఁగాక.

(నిష్క్రమించుచున్నాఁడు.)



## రంగము ౬. అరణ్యప్రదేశము.

(సిద్ధార్థుఁడు చెన్నుఁడు గుఱ్ఱములమీఁద వత్తురు.)

సిద్ధార్థుఁడు— చెన్నా ! సూర్యుఁడు తీవ్రాంశుఁడై యాకసంబున నెక్కి వచ్చుచున్నాఁడు. అదే నది ప్రవహించుచున్నది. ఇక్కడనే దిగుదము.

చెన్నుఁడు—రాకుమారా! అట్లే చేయుదము. (ఇద్దఱు గుఱ్ఱములు దిగుదురు.)

సిద్ధార్థుఁడు—చెన్నా ! ఇఁక నేను పాదచారినై చనియెదను. నీవు ...

చెన్నుఁడు—రాకుమారా ! ఏమి యిట్లానతిచ్చెదరు?

సిద్ధార్థుఁడు—ఇంక నే నొంటిపాటుననే యుండవలెను.

చెన్నుఁడు—అట్లయిన న న్నెవరి కొప్పగించెదరు?

సిద్ధార్థుఁడు—నిన్ను నీ యీశ్వరున కొప్పగించుకొనుము. చెన్నా ! నీవు మద్వియోగంబునకుఁ జింత చేయవలదు. (గుఱ్ఱము వంక మొగంబై దానిని దట్టి ముద్దిడి నిమురుచు) బాబా! నీ వేల యిట్లున్నావు ?

చ. కనుఁగవ నశ్రుధార లొలుకం గడుదీనత నేడ్వఁబోకు; మో
మును దిగవాంచి క్షోణితలముం గనఁ బోవకు; నేఁడు నీకు నా
కును ఋణబంధమూడె నిటఁ; గూరిమి నీ పడినట్టి కష్ట మె
ల్లను బహుపూజ్యమై శుభఫలప్రద మయ్యెడు నశ్వరాజమా !

(గుఱ్ఱమును నిమిరి తట్టును.)

చెన్నా ! నాకీ కరవాల మేల? (కృపాణము నిరుకేలనెత్తి)

శా. అరికంఠంబులఁ దూఁటి, యుష్ణరుధిరం బాస్వాదనంబుం బొన
ర్చి, రణక్షోణిని మృత్యువౌచు ఘరకార్తిం గూర్చు నీవేడ? న
త్కరుణా లాలితమై కదుర్భువన దుఃఖప్రాప్తికిం గుందు భా
స్వరమా నా మది యేడ? నీ కిదె తిరస్కారంబు నిస్త్రింశమా!

(చెన్నుని కిచ్చును.)

సన్న్యాసినై కాంచనలోష్టములను సమానభావమునఁ గాంచు నాకీ భూషణాంబరము లేల? వీనింగూడఁ గైకొనుము.

(తీసియిచ్చును.)

చెన్నా! కంటకాశ్వముతోడ నీ వింటికి మరలుము.

చెన్నుఁడు—రాకుమారా! నేనును సంసారంబుఁ బరిత్యజించి మీకు శుశ్రూష చేయుచు మీ పాదములకడనే యుండువాఁడ.

సిద్ధార్థుఁడు—చెన్నా! నీ కోరికకు సంతసించితి. కాని, నా వెంట నుండుట కిది సమయము గాదు. కాలాంతరమున నీ మనోరథసిద్ధి చేయుదును. ఇప్పటి కింటికిఁ బొమ్ము.

చెన్నుఁడు—రాకుమారా! మీర లిట్లానతిచ్చిన నే నేమందును?

సిద్ధార్థుఁడు—చెన్నా! నేను సన్న్యాసినై సర్వదుఃఖ నివృత్తిమార్గ మన్వేషింపఁ బోవువాఁడ. తరలుము.

(చెన్నుఁడు సాష్టాంగ దండప్రణామము లాచరించి నిలుచును.)

చెన్నా! నా తండ్రితోడను, నా తల్లితోడను, నా భార్య తోడను, మంత్రులతోడను, ప్రజలతోడను, నేను సన్న్యాసి

నై తినని చెప్పుము. నావిషయమై విచారింపవలదని పలుకుము. భగవదనుగ్రహ ముండెనేని కాలాంతరమునఁ గపిలవస్తు పురమునకు వచ్చి యందఱకు దుఃఖ నివృత్తి మార్గమును బోధింతునని నుడువుము. సర్వమును రక్షించుటకే నా సర్వస్వమును విడనాడుచున్నాను.

నేఁ బోయెదను. చెన్నా! ... ఊఱడు మూఱడుము. నా యుద్యమము సఫలీకృత మగుటకై యీశ్వరుని బ్రార్థించుము. ఊఱడుము. (పోవుచున్నాఁడు.)

చెన్నుఁడు— (సిద్ధార్థుఁడు పోయినదిక్కు చూచుచు దుఃఖముతో) అయ్యో! రాకుమారుఁ డూఱడుమని చెప్పి పోయెఁగా.

సీ. ఓఱటనాకెట్లు లోనఁ గూడు నయ్య! యే
మొగమునఁ బురికి నేఁ బోవనేర్తు?
రాజునకు యశోధరా దేవికెట్లు లీ
పాపంపు మోమును జూపనేర్తు?
అంధకారాత్మక మైన నా జీవిత
శేష మెవ్విధిఁ బూర్తి సేయనేర్తు?
సిద్ధార్థు డానతిఁ జెల్లింప లేకుండ
నూరక యేనెట్టు లుండనేర్తు?

గీ. సంగతుల దేవులకు మఱి క్ష్మాపతికిని
నెఱుఁగఁ జెప్పక యిట నుందు నేని యకట
దేవునకు స్వామికిని నాదు దేశమునకు
ద్రోహ మొంచిన వాఁడ నాదును గరంబు.

(సిద్ధార్థుఁడు పోయినవల నట్టె చూచుచు)

రాకుమారా ! పొమ్ము, పొమ్ము. నీయుద్యమము సఫలీకృతమైన తరువాతనే రమ్ము. ఈశ్వరా ! ఈతని యుద్యమము సత్వరము సఫలీకృతము చేయుము. (కన్నులు మూసికొని ధ్యానము చేయును.)

(కన్నులు తెఱచి) అదే రాకుమారుఁడు మఱుఁగుపడె. రాకుమారా ! పోయిరమ్ము. నేను భవదాజ్ఞాపాలనము చేసెద. (కంటఁ దడిరాఁగ రెండుగుఱ్ఱములను నడిపించుకొని పోవును.)

---

రంగము 6. కపిలవస్తుపురము. యశోధర మందిరము.

(యశోధర బిడ్డ నెత్తికొని కూర్చుండి యుండును.)

యశోధర — (దుఃఖముతో) హా ! నాథా !

ఉ. ఆకు మఱుంగు పిందెవలె నార్తియెఱుంగవు; చింతసేయుచో
నాఁకటిప్రొద్దెఱుంగకయె యట్టులె యుందువు పిల్చుదాఁకఁ, బ్రే
మైకమయుండ వాటఁ దెగటార్పవు పైకొను వ్యాఘ్రియైన; నీ
వేకరణిక్ ఘనాటవిఁ జరింతువొ? మృత్యువు నోసరింతువో ?

ఉ. ఆదరమొప్ప నీదు చరణాంబుజసేవన జాయమాన పా
వ్నోప మనంతరాయముగఁ బొందుదు నంచని యున్న నన్ను, నా
థా ! దరిగానరాని పరితాపమహాంబుధి ముంచి పోయితే ?
నీను పవిత్రమౌ చరణనీరజసేవకు నైన నోఁచనే ?

హా ! నాథా ! కరుణాసముద్రుఁడవగు నీవు నన్నిట్లు శోకానలంబునఁ ద్రోచి పోదువని స్వప్నమందైనఁ దలఁపనైతి. స్వప్నమన్న జ్ఞప్తికి వచ్చుచున్నది. ఆనాఁడు- నేను గలఁగాంచిన

రేయి, 'నా గర్భమందు నెలకొనియున్న మీ తేజస్సనతికాలముననే పుత్రరూపమున నుదయించు' నని నేననఁగఁ, 'బుత్రోదయమువలన నీ భాగ్యము పండును; నాకును ముక్తిగతి కలుగును,' అని నీవు నుడివితివి. దాని యర్థము మూఢురాలనగు నా కప్పుడు స్ఫురింపక యిప్పుడు గోచరించుచున్నది.

మనోరమణా! నీవు నన్నీడనాడిపోవుచో నెంత దురపిల్లితివో, చిన్నికుమారు నెంత ముద్దాడితివో. కాని, నాపాడు నిద్ర నన్నావేశించి నాకు మహాపకారము చేసినది.

(రాహులుఁ డేడ్చును.) రాహులా! ఏల యేడ్చెదవు? నాఁటి రాత్రి యంతయు నూరకుండి యిప్పు డేడ్చిన నేమి ప్రయోజనము? ఆ రేయి నీ వేడ్చుచుండిన యెడల నేను మేల్కొనియుండి మీతండ్రి యుద్యమం బుడిపియుందును గదా. కుమారా! నీవును మీతండ్రి యుద్యమమునకుఁ దోడ్పడితివా? తనయా! మన కెట్టి ఘోర విపత్తు సంభవించినదో నీ వెఱుంగవు.

చంద్రిక—(ప్రవేశించి) తల్లీ! యశోధరా! చెన్నుఁడు వచ్చి, మహారాజుగారితో మాటలాడుచున్నాఁడు; ఇప్పు డిక్కడికి రావచ్చును.

యశోధర.—(ఆత్రమున) నాథుఁడుగూడ వచ్చినాఁడా?

చంద్రిక—ఆయన రాలేదు. కంటకాశ్వము మాత్రము వచ్చినది.

యశోధర—చంద్రికా! బిడ్డని దొట్లలోఁ బెట్టి యూఁచుము. (చంద్రిక యట్లుచేయును.) హా! చెన్నుఁ డెట్టి కఠోర వార్తను వినిపించునో. మనసా! ధైర్యము వహింపుము.

(చెన్నుఁడు కంటకముతోడ దీనతఁ బ్రవేశించును.)

హా! చెన్నా! హా! కంటకమా! (కంటకముయొక్క కంఠముం గౌఁగిలించుకొని)

క. పతి యెక్కడకుం గొనిపో
యితి? యెక్కడనొంటి విడచి యేతెంచితి? నే
కతన మరల నిటకుఁ గ్ర్రూ
రతయేర్పడ నతనిఁ దేరవైతివి? చెపుమా!

నీ వారాత్రి బిట్టు సకిలించియుండిన నెవ్వరైనను మేల్కొని యుందురుగదా. నీవును బతి యుద్యమమునకుఁ దోడ్పడితివా?... ...హా చెన్నా! నీవును నన్ను మేల్కొలుపవైతివా?

చెన్నుఁడు—తల్లీ! నేనారాత్రి యెప్పటియట్ల నా గదిలో నిద్రించుచుంటిని. మంచి నిశీథమున నాగదిలోనికి వచ్చి, నన్నాతఁడు మేల్కొలిపి కంటకాశ్వమును సిద్ధము చేయుమని చెప్పెను. నేనప్పుడు 'రాజాజ్ఞ యెఱింగి యున్నారుగదా. భూరి కవాటము లన్నియు మూయఁబడియున్నవే?' యని నుడివితిని. అందుల కాతఁడు 'చెన్నా! ఈ మందిరమున నేఁ జేయవలసిన కార్యము లన్నియుఁ బరిణతిఁ గాంచినవి. ఇంక గృహపరిత్యాగముచేసి, లోకోద్ధరణోపాయ మన్వేషింపఁ బోవుచున్నాను' అని చెప్పి, నన్నునాగదినుండి మధ్యాంగణమునకుఁ దోడ్కొని వచ్చి, కవాటములన్నియుఁ దెఱచి యుండుటను, దేవత లాకాశమున గానము సేయుచుండుటను జూపి, నన్నశ్వశాలకు రానిక్కచ్చి చేసెను. నేనప్పుడు ముగ్ధుఁడనై బదులాడలేక లాయమునకుఁ బోయి, యీ యశ్వరాజమునకు మఱియొక దానికిని

బల్యాణములు వేసి, యాయత్తముచేసితిని. అంతనాతఁడు దీని నారోహించి నన్ను దన వెంట రమ్మనెను. నేనును గుఱ్ఱ మెక్కి యతని వెంటఁ బోయితిని. సూర్యోదయానంతరము రమారమి నాలుగు గడియలకు 'అనోమా' నదీ తీరముఁ జేరి యక్కడ దిగితిమి. అచ్చట నతఁడు తన కరవాలమును, ఒడలి మీఁది యాభరణాదికములను నాకొసఁగెను. వానిని బరిగ్రహింపక, తనవెంట వత్తునని నే నెంత బతిమాలినను నాతఁడు వినక, నన్ను వెనుక కూరికిఁ బోవ నిక్కచ్చిచేసెను. తన్ను శుశ్రూషించు భాగ్యమునకైనను నాకియ్యకో లొసంగ లేదు. నాతల్లీ! ఇఁక నే నేమని చెప్పుదును? ఆయన గిరి వ్రజంబుదిక్కుగాఁ బోయె.

అమ్మా! ఇదే యాతని చంద్రహాసము; ఇవే యాభరణంబులు. (వానిని గ్రింద నుంచును.)

యశోధర—తన జనకుని దగుటచే రాహులునకు జ్ఞాపకార్థము చంద్రహాస మొక్కటి యుండుఁగాక. చెన్నా! మన్మథునిను వెడలిపోవఁ బాముపడియున్న యీ దేహ గేహమున కలంకారము లేల? వాని నీ భార్య కిమ్ము.

చెన్నా! ఆయన నాతో నేమైనఁ జెప్ప మనెనా?

చెన్నుఁడు—తల్లీ! ఆయన మీతో "నాకై విచారింప వలదు. నేను సన్న్యాసి నైతి" నని చెప్ప మనెను?

యశోధర—హా నాథా! జీవితేశ్వరా! (మూర్ఛిల్లును.)

చంద్రిక—(సమీపించి) ఊఁటడిల్లు మూఁటడిల్లుము.

(శుద్ధోదనుఁ డున్మాదావస్థలోఁ బ్రవేశించును.)

శుద్ధోదనుఁడు—అదిగో! అదిగో! కుమారుఁడు! నాయనా! ఎప్పుడు వచ్చితివి? రమ్మా, నాయనా! ఏల పోవుచున్నావు? నా దగ్గఱ రావా? కుమారా! వలదు, వలదు; పోవలదు. అయ్యో! అంధకారమే! ఘోరాంధకారమే! .. ఆ హా హా! వెలుఁగు, వెలుఁగు! కుమారా! ఎందుఁ బోయియుంటివి? తనయా! ఈ కాషాయాంబరము లేల? వీనిం జింపి పాఱవేయుము. కుమారా! ఏల యట్లు పోవుచున్నావు? నాపైఁ గోపమా? కుమారా! వలదు, వలదు, పోవలదు. (పఱుగెత్తఁ బోయి పడిపోవును.)

గౌతమి—(ప్రవేశించి) హా కుమారా! హా! యశోధరా! హా నాథా! (మూర్ఛిల్లును.)

చెన్నుఁడు—ఎట్టి ధీరుల కెంత యుద్వేగము గలిగినది! పుత్రశోక మెంత దుస్సహాము!

చంద్రిక—(గౌతమిని సమీపించి యుపచారము చేయుచు) అమ్మా! శాంతింపుము, శాంతింపుము.

శుద్ధోదనుఁడు—కుమారా! వచ్చితివా? రారమ్మా; మరలఁ బోవుచున్నా వేమి?

చెన్నుఁడు—మహారాజా! శాంతింపుఁడు, శాంతింపుఁడు.

శుద్ధోదనుఁడు—కుమారా! కుమారా! రా రమ్మా. నీవు లేనిది నాకు శాంతి యెక్కడిది? కుమారా! కాషాయాంబరముల విసర్జింపుము. నీ సుకుమార శరీరమున కవి తగునా? ఏల యట్లు చుఱచుఱ చూచెదవు?

చెన్నుఁడు—హా! నేనిప్పు డేమి చేయుదును? అమాత్యవరునిఁ దోడ్కొని వచ్చెద. (గౌతమి వంకకుఁ బోయి) అమ్మా!

శుద్ధోదనుఁడు—కుమారా! కుమారా! పోవలదు, పోవలదు. యశోధరను విడిచి పోవలదు. (పఱుగెత్తి పోవును. చెన్నుఁడు సాశ్వముగ నాతని వెంట నాకులపాటుతో వడివడిఁ బోవును.)

చంద్రిక—అయ్యో! అమ్మలారా! లెండు, లెండు. శుద్ధోదన మహారాజుగారి కున్మాదము పట్టి వెలుపలికిఁ బఱుగెత్తి పోవుచున్నారు.

గౌతమి—(లేచి) అయ్యో! నాధా! నాధా! (శుద్ధోదనుఁడు పోయిన దిక్కు పోవుచున్నది.)

యశోధర—(తేఱి) చంద్రికా! చెన్నుఁ డెక్కడ?

చంద్రిక—తల్లీ! నీవు మూర్ఛిల్లియుండ, మీ మామగారును, అత్తగారును, నిటకు వచ్చి యుండిరి. మీ మామగారికిఁ బుత్రశోకమువలనఁ బిచ్చి పట్టినది. అతఁడు పిచ్చి పిచ్చి మాటలాడుచు, ఇక్కడనుండి పఱుగెత్తి పోవ, నాతని వెంటఁ జెన్నుఁడును మీ యత్తగారును బోయిరి.

యశోధర—అక్కటా! వా రెట్లు పోయిరే చంద్రికా? పోయిన దారి చూపుమా. (చంద్రిక బిడ్డ నెత్తుకొని రాఁగ నిరువురును దహాతహాతో నిష్క్రమించుచున్నారు.)

---

# గౌతమ బుద్ధుఁడు.

---

పంచమాంకము.

రంగము 1. అరణ్య మార్గము. తత్సమీపమున నొక వటవృక్షము.

(సిద్ధార్థుఁడును నతని యైదుగురు శిష్యులును వత్తురు.)

కౌండిన్యుఁడు---చిత్తశాంతికిని మోక్షప్రాప్తికిని సాధనమైన యోగాభ్యాసముం ద్యజింప నేల?

సిద్ధార్థుఁడు—దేహ శోషణాది కర్మయుక్త మగు తపశ్చరణమువలనఁ జిత్తశాంతియు మోక్షమును గలుగమిచే. ఆఱేండ్లుగాఁ గడుఁ గఠోరమగు యోగాభ్యాసము చేసితిఁ గదా ?

కౌండిన్యుఁడు—ఔను; చేసితిరి. ఇంకఁ గొంత కాలము ...

సిద్ధార్థుఁడు—ఇంకను గొంత కాలము చేసియుండిన నాత్మహత్యాపాతకమునకు మాత్రము గుఱియై యుందును. నిన్న యుదయమున నదిలో స్నాన మాచరించి, లేవఁబోవుచో నా కన్నులకుఁ జీఁకటులు క్రమ్మెను; నే నెట్లో చేతి కందుచున్న చెట్టు కొమ్మను బట్టుకొని పైకిలేచి, గట్టు చేరితిని. పిదపఁ గొంత విశ్రాంతి తీసికొని కుటీరమునకుఁ బోవ నుంకించి, కొన్ని యడుగులు నడచితిని. కాని, నాకు శోష వచ్చెను నిసుకలోఁ బడి

పోతిని. అంతట మీరువచ్చి, నేను మరణించినట్లు నిశ్చయించితి మని చెప్పితిరిగదా. మీరు నన్ను వెదకికొనుచు వచ్చి—యుపచారములు—చేయకుండిన—నాకు మరణమే ... (శోషచేఁ జతికిలఁ బడును. కౌండిన్యాదు లుపచారములు చేయుదురు. అంతఁదేఱి) కటికి యుపవాసములచే—నాశరీర—మెంత బలహీనమైనదో ... చూడుఁడు. (లేవఁబోవును.)

భద్రకుఁడు—మీ రాయాస పడవలదు. ఆ మఱ్ఱికడకు మిమ్ముల నెత్తికొని పోవుదుము.

సిద్ధార్థుఁడు—సహచరులారా ! వలదు, వలదు. అది సమీపముననే యున్నది. ఎట్లయినను నడచి వత్తును. (శిష్యులు చేయూఁత యీఁగా నడచి వచ్చి, మఱ్ఱిక్రిందఁ జదికిలఁబడి మరల శోషిల్లును.)

కౌండిన్యుఁడు—మిత్రులారా ! ఈతఁడు మిక్కిలి బడలి యాహార మపేక్షించుచున్నాఁడు. ఇతని కాహార మియ్యకున్న నపాయం బొదవు. బసవా ! మహానామా ! మీ రిక్కడనే యుండుఁడు. మేము పోయి ఫలంబులఁ దెచ్చెదము.

బసవుఁడు—అట్లే చేయుఁడు. సత్వరమ రండు.

(అశ్వజిత్తు, భద్రకుఁడు, కౌండిన్యుఁడు, నిష్క్రమింతురు.)

మహానాముఁడు—స్వామీ ! స్వామీ !

సిద్ధార్థుఁడు—దా-హ-ము, దా-హ-ము.

మహానాముఁడు— బసవా ! ఇతఁడు పిపాసితుఁడై యున్నాఁడు జలాశయ మిం దెందేనియుండిన సలిలము దెమ్ము. ఈ కమండలువు గొనిపొమ్ము.

బసవుఁడు—నీ విందే జాగ్రత్తతో నుండుము. నే నిప్పుడే వచ్చెద. (నిష్క్రమించుచున్నాఁడు.)

దేవదత్తుఁడు—(ఖడ్గధారియై ప్రవేశించి)

చ. వనముల వీఁడు చేరి బహువత్సరముల్ చనె; నేఁడు వ్యాఘ్రము క్షీణి బడియుండ నోపునని చిత్తమునం బరితోష మందితిన్;
దనువున నున్నవాఁడని వినంగను నా హృదయంబు క్రోధవ
హ్నినిఁగడుఁ దప్తమయ్యెడు; హరించెదఁ జిక్కిన వీని ప్రాణముల్.

వీఁడు నాకంటెఁ బడెనా యీ యసిధారతో వీని ప్రాణములు దీసి నాకసి దీర్చికొందును. నిన్ననే వీఁడా యోగాశ్రమమును గతిపయ శిష్యులతో విడిచిన ట్లా యోగులు చెప్పిరి; ఈ యారణ్యమున నిందెందో యుండును. (వినుట నభినయించి) మాటల సవ్వడి వినఁబడుచున్నది.

సిద్ధార్థుఁడు—(చుట్టును జూచి, యాయాసముతో) మహా ... నామా! తక్కిన—వా—రెక్కడ?

మహానాముఁడు-ఫలములు, జలములు, తేరఁ బోయి నారు.

సిద్ధార్థుఁడు—దా-హ-ము; దా-హ-ము. (మరల శోషిల్లును.)

మహానాముఁడు— సలిలముఁ దేర బసవుఁడు పోయి నాఁడు. అతఁడింతలో వచ్చును. ... అయ్యో! ఏమి చేయుదును?

గురువర్యునకు మరల శోష వొడమినది. (ఉపచారములు చేయు చుండును.)

దేవదత్తుఁడు—ఆవృక్షంబు నీడ నెవ్వరో యున్నారు! (సమీపించి) అయ్యా! మీ రెవ్వరు? ఎక్కడనుండి యెక్కడకుఁ బోవుచున్నారు?

మహానాముఁడు—అయ్యా! మేము పాంథులము. యోగాశ్రమము వెడలి, యిట్టులే పోవుచున్నారము.

దేవదత్తుఁడు—సిద్ధార్థుని జూచితిరా?

మహానాముఁడు—ఈయన యెవ రనుకొంటిరి?

దేవదత్తుఁడు—ఏమీ! ఈతఁడు సిద్ధార్థుఁడా?

మహానాముఁడు— మే మెఱిఁగిన సిద్ధార్థుఁ డితఁడే. ఘోరతపశ్చరణముచేతఁ జిక్కి, మార్గాయాసముచే మిక్కిలి బడలి యున్నవాఁడు.

సిద్ధార్థుఁడు—దా-హ-ము, దా-హ-ము.

దేవదత్తుఁడు— (తన నడుమునందలి సిద్దెను దడవి చూచికొని) అయ్యో! నాయొద్ద నున్న జల మంతయు నయి పోయినదే.

మహానాముఁడు— అక్కటా! వీ రేల యింత తాలసించిరి? (దేవదత్తుని జూచి) జలములు పండ్లు తేరఁబోయిన మా మిత్రులు చాల కాలమైనను రాకున్నవారు. దయచేసి వారి నించుక యరసి తోడితెచ్చెదరా?

దేవదత్తుఁడు—మీరే పోయి రండు. నే నిందే యుండి సిద్ధార్థుని జూచికొనుచుందును. నేను సిద్ధార్థుని బాల్యమిత్రుఁడను.

మహానాముఁడు— అట్లులా? ఈతని జాగ్రత్తలోఁ జూచికొనుఁడు. నే నిదే వచ్చెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

దేవదత్తుఁడు— (సిద్ధార్థుని నెగాదిగఁ జూచి) ఎంతచిక్కియున్నాఁడు! ఎంత విలక్షణుఁడై యున్నాఁడు? నేఁడో రేపో చావనున్నాఁడు. అట్లని వీనిఁ దెగటార్పక విడువ నగునా? అగ్నిశేషమును శత్రుశేషమును నుంచఁదగునా? ... విలువిద్య యందు నన్నోడించి, నాకు భార్యగావలసిన పరిపక్వబింబఫల సదృశాధర యగు నా యశోధరను, దనకు భార్యగాఁ గైకొన్న ప్రత్యర్థిగదా వీఁడు! ఆ కురంగాక్షిని లేవఁదీయవలె నను మదీయ ప్రయత్నములనెల్ల నెఱిఁగి, నన్ను రాజ్య నిర్వాసితుఁ గావించిన యీ మదాంధుఁడగు శుద్ధోదనుని తనూజుఁడుగదా వీఁడు! అట్టి వీనిని మన నియ్య నగునా? ఇదే వీని ప్రాణంబుల హరించెద. (ఒఱలోని కత్తినిదీసి చుట్టును బరికించి) అయ్యారే! ఎవ్వరో వచ్చుచున్నారు. వీరు నా కత్తిదూయుటను జూచి యుండరుగదా. ఈ చాటుననే యుండి వీరు పోయిన తరువాత వీని నాయసిపుత్రిక కాహుతియిచ్చెద. (కత్తి నొఱలోఁ ద్రోసి ప్రక్కపొదరింటిలో డాఁగును.)

సిద్ధార్థుఁడు— మహా-నామా! నన్నుఁ- గూర్చుండఁ- బెట్టు. మహా-నామా! ...(కడుఁ బ్రయత్నమునఁ గూర్చుండి) మహా నామా!

(సుజాతయు రాధయుఁ బ్రవేశించుచున్నారు.)

రాధ— సుజాతా! ఈ మహావృక్షము నాశ్రయించి యున్న దేవత నారాధించుటవలన నీ గర్భశుక్తి ముక్తాఫల సమన్వితమాయెను.

సుజాత—అవును రాధా ! అవును.

రాధ—నేఁడో రేపో నీవు ప్రసవింతువు. పుత్రవతి వగుదువు.

సుజాత—కావుననే నేఁడీ చైత్రపూర్ణిమనే దేవతకుఁ బాయస నివేదనము చేయుట.

రాధ—అది సరియె. (చెట్టుక్రింద సిద్ధార్థుని జూచి) ఆశ్చర్య మాశ్చర్యము !

సుజాత—రాధా ! ఏమి చూచితివే?

రాధ—సఖి ! ఏమి నీ యదృష్టము ! దేవతయే వృక్షంబు క్రింద సాక్షాత్కరించినది !

సుజాత—(చూచి) ఆహా ! ఏమి నా భాగ్యము ! (సమీపించి) ఓ దేవస్వరూపా ! భక్తిపూర్వకముగా నా చేయు నుపచారములు స్వీకరించి, నా నివేదించు క్షీరాన్నమును భుజించి నన్ననుగ్రహింపుము. (ధూప దీపము లొడఁగూర్చి, క్షీరాన్న నివేదన మొనర్చి హారతియెత్తుచు)

(గేయము. హరికాంభోజిరాగము.)

ఓ దీనబంధూ ! శమదమ విలసిత ! వరకారుణ్యసింధూ॥ప॥
దేవ వరజననుత ! మహాప్రభావ !
నిఖిలభువన హితమయ జీవ ! సకల గుణకలిత స్వభావ ॥
శ్రితపాప విభంజన !
చిత్రశక్తిమయ సజ్జనార్తి ఘనమేఘ ప్రభంజన !
భక్త విరంజన ॥

(ఇద్దఱు నమస్కరింతురు. నివేదింపఁబడిన క్షీరాన్నము గిన్నెలో రాధ పోయఁగా, సుజాత దానిని సిద్ధార్థుని

చేతి కందిచ్చును. సిద్ధార్థుఁడు క్షీరాన్నమును భుజించు చుండును.)

దేవదత్తుఁడు—(ముందటికి వచ్చి) ఆఁకలిచేఁ జావనున్న వీని కాహారము పెట్టుచున్నా రీ యువతులు! అదే! శిష్యులు వచ్చువారు.

(శిష్యులైదుగురు దూరమునఁ బ్రవేశించుచున్నారు.)

భద్రకుఁడు—సిద్ధార్థునొద్ద యువతు లున్నారు!

కౌండిన్యుఁడు— ఏమో యుపచారములు చేయు చున్నారు.

అశ్వజిత్తు—అన్నము భక్షించుచున్నాఁడు.

భద్రకుఁడు—వీరు గొల్లయిల్లాండ్రు. వీరిచేతి యన్నము దిని భ్రష్టుఁడైనాఁడు.

అశ్వజిత్తు—వీనిం బరిత్యజింపవలయును.

కౌండిన్యుఁడు—కొంచెము తాళుఁడు. వారి సంభాషణ మాలకింతము.

సిద్ధార్థుఁడు—సోదరీ! నీకు సత్సంతానము గలుగుఁ గాక! అమ్మా! నీవు దలఁచు నట్లు నేను దేవతనుగాను. నేను మానవుఁడను. సన్న్యాసము స్వీకరించి సత్యాన్వేషణము చేయుచున్నాను. తల్లీ! నీ వొసంగిన భక్తిపూర్వకమగు స్వాతి కాహారమువలన నాకుఁ బ్రాణములు నిలిచినవి; బలము చేకూరుచున్నది. నే నన్వేషించు పదార్థము నన్ను సమీపించు నట్లున్నది.

సుజాత—స్వామీ ! మీరు మానవరూప మెత్తిన దేవతాస్వరూపులు. మీరన్వేషించు వస్తువు మీకు లభించుఁగాక. మేము పోయివచ్చెదము. (సుజాతయు, రాధయుఁ జాగిలి మ్రొక్కుదురు.)

సిద్ధార్థుఁడు—మీకుఁ జిత్తసుఖంబు గలుగుఁగాక.

(సుజాతయు, రాధయు నిష్క్రమించుచున్నారు.)

భద్రకుఁడు—సోదరులారా ! కులభ్రష్టుఁడై, ధర్మభ్రష్టుఁడై చెడినవాని శుశ్రూషింప నేల ?

బసవుఁడు—వీని గురుత్వముం దిరస్కరింతము.

అశ్వజిత్తు—వీనినే పరిత్యజింతము.

మహానాముఁడు—బలహీనుఁడై మానవ సాహాయ్యమపేక్షించు స్థితియందుండు గురుని విడిచిపోవ నగునా ?

భద్రకుఁడు—వీని జాడచూడ నాస్తికుఁ డగున ట్లున్నది. ఇట్టివాని నాశ్రయించుటవలన మన కనర్థములు సంభవించును. మహానామా ! కౌండిన్యా ! బదులాడక యూరక మా వెంట రండు. కాశికిఁ బోయి యందుఁ దగిన గురువు నాశ్రయింతము.

కౌండిన్యుఁడు—ఇతనికి మన యుద్యమము చెప్పనైనఁ జెప్పవలదా ?

భద్రకుఁడు—నేనే చెప్పెదను. (సిద్ధార్థుని సమీపించి) అయ్యా ! మీ మార్గములు మాకు సరిపడవు. మా దారిని మేము పోవుచున్నాము. మీదారిని మీరుఁ బొండు.

సిద్ధార్థుఁడు— ఏమీ ! సహచరులారా ! నన్ను విడనాడితిరా? ఇది న్యాయ్యమా ? కౌండిన్యా ! మహానామా !

మీరును నన్నుఁ బరిత్యజించితిరా? ... పొండు; పొండు. సత్యా న్వేషణ తత్పరత నుండుఁడు. (శిష్యు లందఱు నిష్క్రమించు చున్నారు.) చిత్తము ధ్యానాయత్త మగుచున్నది!

చ. సమధిక క్షుత్పిపాసలకు సైపఁగ లేక మహార్తి నున్న నా
కమృత సమాన పాయసము నర్మిలిఁ బెట్టిన కోలె నాదు చి
త్తము గడు శాంతిఁ బొందెఁ బరతత్త్వ విచారము దారిఁ గాంచెఁ బ
య్యమ యిడినట్టి పాయస మహత్త్వము నా స్తవిశేష మెట్టిదో!

నేఁడు పూర్ణ ప్రయత్న మొనర్చిన దివ్యజ్యోతి ర్దర్శనమగు నని నాకు గోచరించుచున్నది. నేను జనుఁడ నగువఱకీ వృక్షచ్ఛాయనుండి కదలను. (ధ్యానముం బూనును.)

దేవదత్తుఁడు—(ముందఱికివచ్చి) శిష్యులు తమ గురువునకుఁ దగిన గతిఁ గల్పించిరి. తపఃక్లేశము ననుభవింపనున్న వీని నే నేల తెగటార్చి వీని బాధల కంత మొందింప వలయు? అనన్య సహాయుఁ డగు వీఁ డెందుఁబోవును? ఈ సమీప నదిలో స్నానంబు సలిపి, పొరుగూరికిఁ బోయి భోజనముగావించి వచ్చి, వీనిజాడ లరసెదఁగాక. (తన సిద్దెలోని నీరు పాఱఁబోసి నిష్క్రమించు చున్నాఁడు.)

సిద్ధార్థుఁడు—(ధ్యానమున) ఏమి యీఘంటానాదము! ఎంత యుజ్జ్వలమగు నక్షత్రకాంతి! ... ఎక్కడిదీ నూపురధ్వని? ఇది యేమి యశోధరా! యిట్లు వచ్చితివి? ఇక్కడకు నీవు రాఁ జనునా? చిన్నికుమారుని జూచికొనుచుండుము; పొమ్ము. అశ్రుధార లేల కార్చెదవు? ఐహిక శోకాపనోదక మగు మార్గ మన్వేషింపఁ బోవుచున్నాను. సంతోషమునఁ బొమ్ము.

జనకా! ఇట్లేల వచ్చితిరి ?... ఏమంటిరి ?... రాజ్యాధికారము స్వీకరింపవలయునా ? అండసదృశమై స్వేచ్ఛారహితమై యప్రియమగు రాజత్వమును స్వీకరింపు మనుట న్యాయ్యమా ? అండమునుండి వెలువడిన పక్షి మరల నండముం బ్రవేశించునా ? క్షోభరహితమై, దుఃఖదూరమై, శాంతియుతమై, నిశ్చలానందదాయకమైన నిర్వాణరాజ్య పరిపాలనమునకై యత్నించుచున్నాను. తండ్రీ ! నన్ను క్షమింపుఁడు. నన్నాశీర్వదించి పొండు ... మీ యాశీర్వాదముల స్వీకరించుచున్నాను.

ఏమీ యంధకారము ! అంధకారమునుండి వెలువడిన మీ రెవ్వరు ? పలుక రేమి ? ఏల యిట్టి భయంకరాకారమున నున్నవారు ? నన్నా మీరు భయపెట్టువారు?—ఆహా! నీవా ? మారుఁడవా ? వారు నీ బలంబులా ? ఇవన్నియు మీ మాయలా ? మీమాయలకు నే లోబడుదునని తలఁచితిరా ? మారా ! ఏ మనుచున్నావు ... ఎట్టి మాట పలికితివి ? సర్వసంగ పరిత్యాగినైన నా కా భోగము లేల ? నేను గృహాభిముఖుఁడను గాను; పోపొమ్ము.

ఏమనుచున్నావు? ...నిర్వాణముం బ్రవేశింపు మనియా ? నే నన్వేషించు ధర్మమార్గము నాకలవడి, దానిని బహుదుఃఖమగ్నమగు లోకమునకు బోధించువఱకు నేను నిర్వాణముం బ్రవేశింపను. ఓ యంధకార సంభవులారా ! ఏల నన్నిట్లు బాధించి మీరూరక శ్రమపడుచున్నారు ? మీ రొనర్చు మాయలు నాయందు నిష్ఫలములు. ఓ మాయావులారా ! పొండు; ఛీ పొండు.

ఏమి యీ ప్రచండజ్యోతి! ఓ మాయావులార! ఏల యిట్లు పక్షులవలె పఱచుచున్నారు? ... ఆహా! లోకాతీతమగు నుజ్జ్వలప్రకాశము! నే నేమి గాంచుచున్నాను? ... అహో! బుద్ధులారా! రండు, రండు. దయచేయుఁడు. మీ రాకకై యెదురుచూచుచున్నాను. దయచేయుఁడు. నా కుపదేశ మొనర్పుఁడు. ...

ఆహా! మీ యుపదేశామృత మెంత యానందదాయకము! సంతుష్టుఁడనైతి; సంతుష్టుఁడనైతి. మరల నుజ్జ్వలజ్యోతి! అహో! బుద్ధులారా! ఉజ్జ్వలజ్యోతిలో లీనమైతిరా?

ఓహోహో! నే నెన్నిజన్మను లెత్తితిని! ఇదె నాకడసారి జన్మము! .. అహో! నాకు లభించె బుద్ధత్వము! లభించె బుద్ధత్వము ... (కన్నులు తెఱచును.)

ఈ బుద్ధత్వము నే నెవరికి బోధింతును? ఎవరికైన నేల బోధింపవలయు? ... ఏమిది! లోక మహార్తి నపనయించు మార్గ మెఱిఁగియు, దాని నుపయోగించు బుద్ధి పొడమకున్నది! ఆహా! నే నెంత స్వార్థపరుండను! దయారసంబున కాలవాలమైన నా హృదయమేల యిట్లుతలపోయుచున్నది? ఓస్వార్థపరత్వమా! దూరము చనుము. ఛీ, నన్నుఁ గలుష మొనర్పకుము.

యోగులారా! నన్ను మీరు పరిత్యజించితిరా? నన్ను మీరు పరిత్యజించినను మిమ్ముల నే విడువనేరను. మిమ్ముల వెదకి నా కలవడిన యీ జ్ఞానజ్యోతిని మీయందుఁ బ్రభవింపఁ జేయువఱకు నా కూఱట గలుగదు.(నిలిచి) నా కుబుద్ధత్వము చేకూర్చిన యో మహనీయ వృక్షమా! నా కనుజ్ఞ యొసఁగుమా. నేను బోయి వచ్చెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

దేవదత్తుఁడు— (ప్రవేశించి) సిద్ధార్థుఁ డెందుఁ బోయి యుండును? (పరికించిచూచి) అదే! నదివంకఁ బోవుచున్నాఁడు. వీనికిఁ దెలియకుండ వీనిని వెన్నాడెదఁగాక.

(నిష్క్రమించుచున్నాఁడు.)

---

రంగము 2. కాశీ సమీపమందలి కురంగారామమందలి మున్యాశ్రమ ప్రాంగణభాగము.

(మహానాముఁడు కౌండిన్యుఁడు కూర్చుండియుందురు.)

మహానాముఁడు— ప్రభాత సమయమునఁ దనకరములను గగనపేటికయందు జొనుపుటచే నక్షత్రముల హరించుచున్నాఁడని యహస్కరుని దస్కరుగా భావించితిమి. ఇప్పుడా నక్షత్రములందే కనఁబడుచున్నవి చూచితివా? కావున నహస్కరుఁడు తస్కరుఁ డెట్లగు?

కౌండిన్యుఁడు— అహస్కరుని దస్కరునిగా నెన్నుట గౌతమసిద్ధార్థుని ధర్మభ్రష్టునిగా మనము దలపోసినట్లే యున్నది. ... గౌతమసిద్ధార్థుని నసహాయస్థితియందు విడిచి వచ్చిన నాఁటఁగోలె నా మనస్సు మిక్కిలి పశ్చాత్తప్త మగుచున్నది. అతఁ డిప్పు డెట్లున్నవాఁడో గదా.

మహానాముఁడు—కడు బలహీనుఁడై యన్యసాహాయ్యమపేక్షించు స్థితియందున్న యాతని బరిత్యజింపఁ గూడదని నే నా వేళనే నుడివితిని. ఎవ్వరు నా పలు కాదరింపరైరి.

(నీళ్లు నింపిన కమండలువులతో బసవుఁడు, భద్రకుఁడు, అశ్వజిత్తు, ప్రవేశింతురు.)

భద్రకుఁడు—మిత్రులారా! గౌతముఁడు కాశికివచ్చి, మనకొఱకై వెదకుచున్నాఁడని గంగాస్నానమునకు వచ్చిన యుపకుండు చెప్పెను.

కౌండిన్యుఁడు— (సంతోషముతో) ఏమీ! గౌతముఁడు వచ్చినాఁడా?

బసవుఁడు—మిత్రులారా! అదిగో! గౌతముఁడే వచ్చుచున్నాఁడు. (అందఱు చూతురు.)

అశ్వజిత్తు—తపస్సునకుఁ దిలాంజలులిచ్చి నాస్తికుఁడై భోగాసక్తుఁడై త్రిమ్మరుచున్నవాఁడు.

కౌండిన్యుఁడు—మన కొఱకిటకే వచ్చుచున్నాఁడు.

భద్రకుఁడు—అతఁడు వచ్చినప్పుడెవ్వరు లేవఁజనదు. నమస్కరింపఁ జనదు.

కౌండిన్యుఁడు—ఒక యాసనమునైన వేసి యుంచుదము.

అశ్వజిత్తు—వలసినచో నతఁడందుఁ గూర్చుండును.
మహానాముఁడు— (దర్భాసనము వేయును.)

(యోగులందఱుఁ దమతమపనుల యందుందురు.)

బుద్ధుఁడు—(గంభీరముగ దూరమునఁ బ్రవేశించి)

గీ. ఇమ్ముగా జ్ఞాన సస్య బీజమ్ము నాఁటఁ
దగిన వ్యాల్ క్షేత్రములు గర్గి తనరువారు
నాదు సహచరు లిచట నున్నారటంచుఁ
దెలియ వచ్చితి మత్కృతూహలము మీఱ.

ప్రొద్దుననుండియు వారాణసీ నగరోపకంఠమందలి యాశ్రమపదంబు లెన్నో వెదకితిని. వారీకురంగారామమున నున్నారని యా దిగంబరయోగి నుడివెను. ఇందును జూచెదను. (కొంతనడచి ముందు దృష్టిసారించిచూచి) అల్లదే! ఇక్కడనే యున్నారు. (వారిసమీపించి) సోదరులారా! తత్త్వాన్వేషణ పరులారా! (అందఱుఁ ద త్తరపాటునలేచి నమస్కరింతురు.)

భద్రకుఁడు—గౌతమా! రమ్ము, రమ్ము.

(మహానాముఁడాసనమును దగ్గఱవేయును, బసవుఁడు జలము దెచ్చి కాళ్లుగడుగును. అశ్వజిత్తు కరవస్త్రముతోఁ గాళ్లనొత్తును.)

కౌండిన్యుఁడు—(నియతి శ్రావ్యముగ) ఏమి యితని తేజః ప్రభావము!

భద్రకుఁడు—(నియతిశ్రావ్యముగ) ఏమి యితనిమనః ప్రసన్నతాశాంతి స్వభావము!

మహానాముఁడు—(నియతిశ్రావ్యముగ) ఏమి యితని నయనద్యుతి!

అశ్వజిత్తు—(నియతిశ్రావ్యముగ) ఏమియీతని నిష్కల్మషప్రేమ!

భద్రకుఁడు—(నియతిశ్రావ్యముగ) ఇవియే మన హృదయ రాద్యములను దమవశము చేసికొన్నవి.

బసవుఁడు—మిత్రమా! గౌతమా! ఎందుండిరాక?

కౌండిన్యుఁడు—ఈ మహానుభావుని పేరం బిలువఁ జనదు; 'మిత్రమా !' యనఁజనదు.

బుద్ధుఁడు— సత్యధర్మగ్రహణ సమాసక్తులారా! ఆ వటవృక్షమునొద్ద మీరు నన్ను వదలిపోయిన నాఁడే నాకు ధర్మజ్ఞాన నేత్ర మంతరుత్పన్న మాయెను. అయ్యది నా యందలి యజ్ఞానాంధకారమును బాఱఁదోలి నాకు బుద్ధత్వమొసంగెను. నేను నూతన మార్గమును గనుఁగొనఁ జాలితిని. నేను దథాగతుఁడను.

భద్రకుఁడు—ముక్తికి సాధనమైన తపస్సునువిడిచిపెట్టి, భోగాసక్తులైన మీకు ధర్మచక్షువెట్లు గలిగినది ?

బుద్ధుఁడు— నేను ధర్మసాధనములను విడువలేదు; భోగాసక్తుఁడను గాలేదు.

భద్రకుఁడు—తపోనుష్ఠానమును వదలినారు గదా.

బుద్ధుఁడు—ముక్తికి సాధనం బగు శరీంబును గర్కశ యోగాభ్యాసముచేఁ గ్లేశ పెట్టుట వలనఁ బ్రయోజనంబు లేదు. ఈ సత్యము నెఱింగినవాఁడ నగుట యోగానుష్ఠానమును వదలినాఁడను ఆఁకలి దప్పు లనియెడి శారీరక నైసర్గిక వాంఛలను సముచితముగఁ దీర్చికొను చున్నాఁడను. ఇట్లు చేయుటచేత నేను గలుషితుఁడను గాను.

భద్రకుఁడు—ఉచిత మన్న నేమో ?

అశ్వజిత్తు—కడుపు నిండ నని.

భద్రకుఁడు—కడుపునిండఁ గూడు పడిన నింద్రియములు చెలరేఁగ కూరకుండునా ?

బుద్ధుఁడు—ఉచిత మన్నఁ గేవలము దేహధారణము నకు వలసినంతి యని; అంతకు హెచ్చయిన భోగ మగును. భోగాసక్తత వలనఁ దృష్ణ యధికమగును. భోగ పరుఁడు కలుషితుఁడు, నింద్యుఁడు, పతితుఁడు.

బసవుఁడు—అట్లయిన సర్వసంగ పరిత్యాగమేల చేయ వలెను? సాంసారిక సుఖములను మితముగ ననుభవించుచు, దైహిక నైసర్గిక వాంఛలను సముచితముగఁ దీర్చికొన నగును గదా.

బుద్ధుఁడు—అట్లు నడచుకొనుట గృహస్థ ధర్మ మగును. కాని సంపూర్ణమగు చిత్తశాంతిని బొందుటకు సంసార పరిత్యాగము చేయవలెను; ప్రాపంచిక సర్వ సుఖములు విసర్జింప వలయును.

భద్రకుఁడు—శారీరక వాంఛలను సముచితముగఁ దీర్ప వలె ననుచున్నారు; మఱియు శారీరక ప్రాపంచిక సుఖముల వర్జింపవలయు ననుచున్నారు. మీ మార్గమేదో మాకుబోధ పడలేదు.

బుద్ధుఁడు—దేహ శోషణాది కర్మయుక్త మగు యోగాభ్యాసముల పొంతఁ బోక, సాత్విక మితాన్న పానములతో దేహ ధారణము చేసికొన వలెను. శరీరము స్వస్థత యందుండినఁ జిత్తము తేజితమును, నిర్మలమును నగును, చిత్తము నున్నత స్థితికిఁ దెచ్చుటకుఁ గొన్ని సాధనము లున్నవి. ఇవి యష్ట విధములై యున్నవి. ఈ యష్టవిధ సాధనములను మునుముందు వివరించెదను.

కౌండిన్యుఁడు—మీది మధ్య మార్గముగ నున్నదే?

బుద్ధుఁడు—నిజముగ నిది మధ్య మార్గమే. అష్టవిధ సాధనములతోఁ గూడిన యీ మధ్య మార్గ మవలంబించుట వలనఁ జిత్తశాంతి గలుగును. జ్ఞాన నేత్ర ముత్పన్న మగును. ఇంద్రియ సుఖము తొలఁగును. అహంబుద్ధి వీడును. కోరిక లడఁగును. దుఃఖము నశించును. బుద్ధత్వ మలవడును. నిర్వాణ పదము సిద్ధించును.

కౌండిన్యుఁడు—ఈ మార్గ మెంత సుస్పష్టము!

మహానాముఁడు—ఎంత సులభము!

అశ్వజిత్తు—ఎంత నిష్కళంకము!

బసప్పుఁడు—ఎంత నిష్కంటకము!

భద్రకుఁడు—మీ బోధామృత వృష్టివలన మా చిత్తముల కంటియున్న మాలిన్యము ప్రక్షాళిత మైనది. మీరు చూపు ధర్మమార్గమునే యవలంబించెదము.

బుద్ధుఁడు—మనము మాత్ర మీ నూతన ధర్మ మార్గ మవలంబించినఁ జాలదు. దీనిని సర్వ లోకమునకు బోధింప వలయును. అట్లు చేయుటకు మన మార్గురము చాలుదుమా?

భద్రకుఁడు, కౌండిన్యుఁడు—చాలము, చాలము.

బుద్ధుఁడు—కావున మన మర్హులగు వారిని నుపసంపదనిచ్చి యర్హతులనుగాఁ జేర్చి యొక సంఘముం గూర్పవలెను. ఈ లోకమున సంఘమే బలము. సత్యధర్మమును ననువర్తించుట యొంటివానికిఁ గష్టముగనే యుండును. ఒంటి

వాఁడు దుర్బలుఁ డగుట, ధర్మచ్యుతిఁ బొందవచ్చును. కావున సంఘబలము నేర్పఱచుకొని పరస్పర సాహాయ్యమును, ప్రోత్సాహమును, బడయవలెను. ఆదియందు మధురమును, మధ్యమందు మధురమును, అంత్యమందు మధురమును నగు బుద్ధ ధర్మమును జనల హృదయంబుల కెక్క బోధించి యీ ధర్మమును లోకమున నెగడఁ జేయవలెను.

అందఱు—బుద్ధదేవా! అట్లే చేయుదము.

బుద్ధుఁడు—అర్హతులు కాఁగలవారు దారపుత్రాదులను గృహమును బరిత్యజించి, ప్రపంచ బంధములను వదలి, సన్న్యాసమును స్వీకరింప వలయును; బుద్ధనియామములను బాటింప వలయును. ఇట్టి వారికి నేనే యుపసంపద నిత్తును.

భద్రకుఁడు—దేవా! బుద్ధ నియమములను శిరసా వహించి యను వర్తింతిము.

మహానాముఁడు, బసవుఁడు, అశ్వజిత్తు—బుద్ధదేవా! మా కుపసంపద నిండు.

కౌండిన్యుఁడు—దేవా! వయస్సునఁ బెద్దవాఁడను. నేనే ప్రథమ బుద్ధ శిష్యుఁడ నయ్యెదను.

బుద్ధుఁడు—సంతోషము; సంతోషము. గంగా తీరంబునకుఁ బోవుదము రండు. అందు మీ కష్టవిధ సాధనంబులఁ గూర్చి సావకాశముగా బోధించి, మఱి యుపసంపదనిచ్చెదను.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

# గౌతమ బుద్ధుఁడు.

---

## షష్ఠాంకము.

### రంగము 1. రాజగృహాపురము. అందలి యొక యింటి ముంగలి భాగము.

(లీలావతియు నామెపతియగు కువిందుఁడును గూర్చుండి యుందురు.)

లీలావతి — నాథా ! బుద్ధుఁడు భిక్షువులుగఁ జేర్చు నధికారము సంఘమున కిచ్చినది మొదలు, ఎంతవేగముగా ఈ బోడితలల సంఖ్య యధికమగుచున్నది !

కువిందుఁడు — ఉరుబిల్వాకస్యపుఁడు, నదీకస్యపుఁడు, గయాకస్యపుఁడు నను ముగ్గురు జటిలులు గలరు. వారి పేళ్లు విన్నావు గదా.

లీలావతి — వినకేమండీ. వీరినే గదా గడ్డాల వారని యందురు.

కువిందుఁడు — వారిగడ్డములిప్పు డెగిరిపోయినవి. వారు తమ సహస్ర శిష్యవర్గముతో బుద్ధమతములోఁ జేరి శిరోముండన దీక్షను గైకొనినారు. బుద్ధుఁడు వీరితోఁగూడ మనరాజగృహంబునకు వచ్చిన తరువాతఁ, బండితులును, మేధా సంపన్నులును నగు నుపాతిశుఁడును, సరిపుత్రుఁడును, సంజయుఁడును, దమ యసంఖ్య శిష్యులతోఁ గూడఁ దలలను బోడి గొట్టించుకొన్నారు.

లీలావతి—వీరికిఁ దలలు బోడి యైనవి గాని తలఁపులు బోడియైనవా ?

కువిందుఁడు— బుద్ధునిమీఁదనే యెన్నో యపవాద ములు మోపఁబడి యుండలేదా? ఇంక ఈ శిష్యులమాట యడుగనేల ?

లీలావతి—బుద్ధునిపై మోపఁబడిన నింద లన్నియు నిరాధారము లని తేలినదిగదా.

కువిందుఁడు—మనము జ స్తివనమున నున్న బుద్ధుని జూడఁ బోయినప్పుడే గదా, అక్కడికి మనవలెఁ జూడవచ్చిన జనతరంగములలో ఆ ఘోష పుట్టెను.

లీలావతి— అది యక్కడనే పుట్టెను; అక్కడనే యణఁగెను.

కువిందుఁడు--దేవదత్తుఁడఁట. బుద్ధుని దాయాదియఁట. ఏకారణము చేతనో కపిలవస్తుపురమునుండి వెడలఁగొట్టఁబడి నాఁడఁట. అతఁ డక్కడికి వచ్చి తన దాయాద మత్సరము పూని యీ వదంతి పుట్టించి నాఁడఁట. ఇట్లని యిటీవల జను లనుకొనుచున్నారు.

లీలావతి—ఎన్ని యపనిందలు పుట్టినను బుద్ధ మత ములోఁ గలసెడివారి సంఖ్య దినదినమునకుఁ బెరుగుచునే యున్నది.

కువిందుఁడు—మనరాజగు బింబిసారుఁడు శిష్య సహి తుఁడగు బుద్ధుని నాదరించి భిక్షచేసి, వేణువనంబును బుద్ధునికి దానముచేసి, తాను దన కుటుంబిని యగు క్షేమాదేవితో

బుద్ధమతము నంగీకరించి, గృహస్థ శిష్యుఁడైన తరువాతనే, వీరింత ప్రబలినది.

లీలావతి—అంతకుఁ బూర్వము మన రాజగృహ వీథులలో వీరింత విచ్చలవిడిగాఁ దిరుగుచుండ లేదు గదా.

కువిందుఁడు—మహాధనికుఁడును, మహాదాతయు, దీనజనపోషకుండును నైన యనాథపిండదుఁడు గూడ బుద్ధమతమును స్వీకరించినాఁడఁట.

లీలావతి—ఇంక ఆతని ధనమంతయు వీరితలలఁ జెక్కుట్కై వినియోగింపఁ బడునేమొ. అట్లయిన బీదలనోటిలో వీరి తలలచెత్తయె.

కువిందుఁడు—అతఁడు శ్రావస్తి సమీపమందలి జేతవనముం గ్రయమునకుఁగొని బుద్ధభిక్షువుల నివాసార్థము గొప్ప పెద్ద విహారమునుగట్టించి బుద్ధునికి ధారాదత్తము చేసినాఁడఁట! విశాఖ యను ధనికురాలు, శ్రమణులు ధరించు చింపి గుడ్డలను, పెంటగుడ్డలను, జూడలేక, వారికివలయు క్రొత్తవస్త్రములను నిరంతర మిచ్చుచుండు నఁట.

లీలావతి—విహార నివాసములు, మంచివస్త్రములు, మొదలగు రాజభోగములు వీ రనుభవించుచుండ, వీరుసన్యాసు లెట్లగుదురో!

కువిందుఁడు— ఇంకొక వింత సంగతి. ఉపాలి యను మంగలి యుండలేదా, వాఁడు బుద్ధుని వలన నుపసంపదను బొంది యర్హతుఁ డయ్యె నఁట!

లీలావతి—అయ్యో! బుద్ధమతమా! భ్రష్టమతమా!

కువిందుఁడు—మొన్న జరిగిన యజ్ఞమునకు బుద్ధుఁడు పరిమిత శిష్యగణముతోఁ బోయి, బలిదానము లజ్ఞానజన్యము లనియు, బలిదానములపేరఁ జేయఁబడు ప్రాణివధలు క్రొత్త పాతకము లనియు, క్రొత్త పాతకములవలనఁ బ్రాతపాతకము లెన్నఁటికి సమయ వనియు, మీఁదు మిక్కిలి పాపరాశి యభివృద్ధి నొందుననియు, నుపన్యసించె నఁట. అంతటితో నూరకుండక యాతఁడు పాలకొయ్యలకుఁ గట్టఁబడిన మేఁకల నన్నిటిని విడిపించెనఁట. బింబిసారమహారాజుకూడ బుద్ధుని యభిప్రాయములను గార్యములను, ఆమోదించుటయెగాక, ఏ నిమిత్తమునఁ గాని మగధ రాజ్యములోఁ బశువులంజంపఁ గూడ దనియు, చంపినవారికిఁ గారాగృహ శిక్ష యగు ననియు, శాసించినాఁడు. నేఁ డుదయమునఁ జాటినది నీవు వినలేదా?

లీలావతి—నేను లోపల నుంటినేమో.

కువిందుఁడు—వంటయిల్లు విడిచి వెలికిరావు. నీ కేమియుఁ దెలియుటలేదు. వట్టి వెంగలి విత్తు.

లీలావతి—మీ రంతయుఁ జెప్పుదురుగదా.... ఎంత కఠినశాసన మిది. ఇంక దేశమున యజ్ఞయాగము లెట్లు జరుగఁ గలవు? దేవళములందుఁ బశుబలు లెట్లు నడువఁ గలవు? వీనిని నిషేధించుట యెంత పాపము! రాజునకే గదా యీ పాపము చుట్టుకొనును. అయ్యో! రాజా! బింబిసారుఁడా! బుద్ధుని బుద్ధి గడ్డి గఱచిన నీ బుద్ధి యేమి మేసెను?

కువిందుఁడు—గణజనాభిప్రాయమును బాటింప వలసిన యీ దినములలో రాజిల్లు నడువఁగూడునా ? రాజునకేమో చేటుకాల మాసన్నమైనది.

లీలావతి—నాథా ! రఘుపతిగారి కొమారుఁడు అనిరుద్ధుఁడు మూఁడు దినములుగాఁ గనఁబడుట లేదుగదా. వాని విషయమై యేమైనఁ దెలిసెనా ?

కువిందుఁడు—ఇంతకు ముందిప్పుడే వింటిని, అనిరుద్ధుఁడు బుద్ధమతములోఁ గలసి భిక్షువైనాఁడని.

లీలావతి—(ఆశ్చర్యముతో) ఏమీ ! రఘుపతిగారి కొడుకనిరుద్ధుఁడా ? మన విశ్వేశ్వరుని మిత్రుఁడనిరుద్ధుఁడా? రుక్మిణి మగఁడనిరుద్ధుఁడా ?

కువిందుఁడు—అవును. ఆ యనిరుద్ధుఁడే.

లీలావతి—పాపము ! రుక్మిణి కాపురమునకు వచ్చి యాఱు నెలలైనను గాలేదు. అయ్యో ! పిల్లా !

కువిందుఁడు—మా మేనత్త మనుమఁడు విమలుఁడు ఉపసంపదకై కొనెనని వారి యూరినుండి వచ్చిన నామిత్రుఁడు చెప్పెను. విమలుని నీ వెప్పుడుఁ జూచి యెఱుఁగవు. వాఁడును బడుచువాఁడే. వాని భార్య యింకను గాపురమునకు రాలేదు.

లీలావతి—అయ్యో ! ఈ బుద్ధుఁడు, అతని శిష్యులు తాము ముండ మోయించుకొనుటయె కాక, పడుచువారి ముండలు మోయించుచున్నారే !

కువిందుఁడు—మంగలికత్తి పోటు తినని బాలిక లేని గృహ మీ రాజగృహంబున లేదని చెప్పవచ్చును.

లీలావతి—మనవిశ్వేశ్వరుని విషయమై నాకు దిగులు గనున్నది. వాఁడు తన యత్తవారి యూరికిఁ బోయి మూఁడు నెలలాయెఁగదా.

కువిందుఁడు—'దానమతి' యొక మూలగొట్టుపల్లె. మొన్ననే గదా వాని మామ వ్రాసినది. అక్కడ ఈ గడబిడ లేమియు నున్నట్టు లేదు. మనవాఁ డా మూలగొట్టు పల్లెలోఁ దన భార్యపజ్జ నుండుటయే మంచిది.

లీలావతి—ఎన్నాళ్లని కోడలిని విడిచి యుండుట. నాకుఁ జాకిరి చేసి చాలయినది.

కువిందుఁడు—దినము లెప్పుడును ఈ లాగుననే యుండవు. బుద్ధుని దాయాది యగు దేవదత్తుఁ డని చెప్పితినే, అతఁడు గణముఖ్యులతో బుద్ధుని నాస్తికతను గూర్చియు, దుష్టమత ప్రచారమును గూర్చియుఁ జెప్పి, వారిని వెంటఁ గొని, యువరాజగు నజాతశత్రుని జూచెనఁట. అజాతశత్రుఁడు బుద్ధుని మన్నయమునకుఁ దన తండ్రి తోడ్పడుచున్నాఁడను కోపముతో (రహస్యముగా) బింబిసార మహారాజును జెయిలోఁ బెట్టించినాఁడఁట.

లీలావతి— మేలు, మేలు. యువరాజా! దేవదత్తా!

(చోఁకలి సిద్దఁడు ప్రవేశించును.)

కువిందుఁడు—ఎవరది ?

సిద్దఁడు—(దండము పెట్టి) నాన్ సాఁకలి సిద్దఁడు. దానమతినుండీ వచ్చిండాను సామీ!

కువిందుఁడు—దానమతిలో ఏమి విశేషము నీ వింత యొకాయెకి వచ్చుటకు ?

సిద్దఁడు—(కూర్చుండి, తన పాగాలోని జాబును దీయుచు) సామోళ్లకు నే నేమని సెపుదు. ఈ జాబు సూసుకోండి. (జాబును కువిందున కిచ్చును; అతఁడు దానిని మనస్సులోఁ జదువుకొనుచుండును.)

లీలావతి—(సిద్దని జూచి) అక్కడ మన వారందరకుఁ గుశలమే కదా ? అబ్బాయి, కోడలు, బాగున్నారు కదా ?

సిద్దఁడు— నేనే సెప్తును తల్లి !

కువిందుఁడు—(అరచేతితోఁ దన నెత్తి కొట్టుకొనుచు) మన విశ్వేశ్వరుఁడు బుద్ధభిక్షువులలోఁ జేరినాఁడఁట. హా ! విశ్వేశ్వరా !

లీలావతి—ఏమి! సన్న్యాసి యయ్యెనా? హా కొడుకా!

సిద్దఁడు—మీా రిట్లా ఎసనం పడితే ఏంపనికి వస్తాది ? విశేశయ్యని యీా రాజగుహాకి తోలుకొచ్చిండా రని దోవలో సన్నాసులు సెప్పిండారు. ఈడ ఆతణ్ణి సూసి ఇంటికి తోలుకు రాండి.

లీలావతి—హా ! కొడుకా ! విశ్వేశ్వరా !

కువిందుఁడు—తల్లిదండ్రుల యనుమతి లేక సన్న్యాసమును స్వీకరించిన యువకులను మరల గృహస్థాశ్రములోనికి జేర్చుకొనఁగూడదు ? ఈ విషయమై దేవదత్తునితో నాలోచించెదను. హాతనయా ! విశ్వేశ్వరా ! హా కోడలా !

లీలావతి— హా ! కొడుకా ! హా కోడలా !

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

రంగము 2. రాజగృహ పురము. అజాతశత్రుని ప్రాసాదమందలి గది.

(అజాతశత్రుఁడు దేవదత్తుఁడు కూర్చుండి యుందురు.)

దేవదత్తుఁడు—అజాతశత్రుఁడా! మీ తండ్రియగు బింబిసారుని గారాబద్ధునిగాఁ జేయుట ప్రజాభిప్రాయమునకుఁ బ్రతికూలముగ నెంతమాత్రమును లేదు. ఇంక బుద్ధుని-

అజాతశత్రుఁడు—నిన్న సాయంకాలము మఱికొందఱు గణజనులు వచ్చి, బుద్ధుని మగధనుండి వెలువరింప వేఁడిరి. జనసామాన్యాభిప్రాయముకూడ దాని కనుకూలముగా నున్నట్లు చారులవలన వింటిని.

దేవదత్తుఁడు—(తనలో) నా చేయు పని నివృత్తిగతికి వచ్చుచున్నది (ప్రకాశముగా) మిత్రమా! వీనిని మగధనుండి వెలువరించిన మాత్ర మేమి ప్రయోజనము? మగధనుండి వెడల నడిచినఁ వైశాలికిఁ బోవును; వైశాలినుండి వెడలఁగొట్టినఁ గోసలకుఁ బోవును; కోసలనుండి బహిష్కృతుఁడైనఁ గౌశాంబికిఁ బోవును. వీఁ డెక్కడఁ బోయినను భిక్షుకసంఘములోనికి యువకులను, గృహస్థులను జేర్చు దుర్నయము వదలఁడు గదా. వీఁడెక్కడ నుండునో యక్కడ జను లేడ్వ వలసినదే గదా.

అజాతశత్రుఁడు—ఇంకేమి చేయ నగును?

దేవదత్తుఁడు—వీనిని ప్రపంచమునుండియే వెలువరింప వలయును.

అజాతశత్రుఁడు—బుద్ధుఁడు నీకు దాయాది యగుట మత్సరముతో నిట్లు చెప్పుచున్నావా?

దేవదత్తుఁడు—రామ ! రామ ! వానియెడ నాకేమి మత్సరముగి నా పెదతండ్రి పుత్రుఁడగుట వానిని నేను ప్రేమించుచున్నాను; దుర్మత ప్రబోధకుఁడగుట వాని మరణమున కాశించుచున్నాను. వానియందలి ప్రేమకంటె లోకులయందలి ప్రేమయె నా కధికమగుట నాకది విధిగాఁ గన్పట్టుచున్నది.

అజాతశత్రుఁడు—చంపుట పాపముగదా ?

దేవదత్తుఁడు—మహోపకారము చేయుటలో నొక యల్పాపకారము చేయుట దోష మెట్లగును ? లోకులు క్రతువర్జితులై, మతభ్రష్టులై, సత్యదూరులై, పాడయిపోవుచున్నారుగదా. ఆ పాపము రాజునకు గదా చుట్టికొనును. ఆ పాపము ముందఱ నిది యేమి పాపముగి వధ లేనితావు ప్రపంచమున నున్నదా? ఆకాశమున, భూమిని, జలమున,వధయున్నది. రక్తసిక్తము కాని యణువే యీ ప్రపంచమున లేదు. నీవు నీ తల్లిగర్భమున నుండినతఱి నీ తల్లి క్షేమాదేవి నీ తండ్రి రక్తమును బానము చేసిన సంగతి నీవు వినవా? నా నెత్తిరాజా ! ఏల నీ కింత జంకు ? ధర్మసంస్థాపనము వధపై నాధారపడి యుండును. చక్కఁగా నాలోచింపుము.

అజాతశత్రుఁడు—(ఆలోచించి) అట్లయిన బుద్ధుని నే యుపాయమునఁ దెగటార్ప నగును?

దేవదత్తుఁడు— మనకు విధేయులగు యాంగులీమాలుఁడు, ఇల్వలుఁడు, నను చోరనాయకు లున్నారుగదా. మనము వారిని బ్రోత్సహించి చెప్పిన, వారా పనినంతయుఁ జక్కఁబెట్టుదురు.

ప్రతీహారుఁడు— (ప్రవేశించి) దేవా ! దేవర పరిచారకుఁడు మధుకరుఁడు వచ్చియున్నాఁడు.

అజాతశత్రుఁడు—లోనికి రానిమ్ము. (ప్రతీహారుఁడు నిష్క్రమించును.) కపిలవస్తు పురమునందు గూఢముగ సంచరించి యందలి సంగతులను దెలిసికొనిరా మనము పంపిన యాంతరంగిక గూఢచారి మధుకరుఁడు.

మధుకరుఁడు—(ప్రవేశించి) దేవరకు జయమగుఁగాక!

అజాతశత్రుఁడు—నీవు తెలిసికొనివచ్చిన విశేషములేమి చెప్పుము.

మధుకరుఁడు— శుద్ధోదనమహారాజు బుద్ధుని శ్రమణ సంఘముతోఁగూడఁ గపిలవస్తు పురమునకు రమ్మనికోరుటకై బుద్ధుని బాల్యమిత్రుఁడైన యుదయుడను వానిని నిటకుఁ బంపియున్నాఁడు. బుద్ధుఁడు తండ్రి యాహ్వాన మంగీకరించినాఁడు. నేఁటికి నాల్గవ దినముననే యతఁడు శ్రమణ సంఘముతోఁ బ్రయాణము చేయనున్నాఁడు. శిష్యులేగాక తాను సహితము కాలినడకనే ప్రయాణమగును.

దేవదత్తుఁడు— మంచి సమయ మాసన్నమైనది. మిత్రమా ! మన మనుకొన్న విషయము సత్వరము కార్యగతికిఁ దేవలసియున్నది.

అజాతశత్రుఁడు—మధుకరా ! నీవు సత్వరము పోయి చోరనాయకులైన యంగులీమాలునితోడను, వాని సహచరుఁడైన యిల్వలునితోడను, నామాటగా నిట్లు చెప్పుము— "మీరు మాకొక పరమ రహస్యమగు ఘనకార్యము చేయవలసియున్నది. వెంటనే రావలయు" నని.

దేవదత్తుఁడు—వారిని రేపు రాత్రికే యెట్లయినను నిటకుఁ దేవలయు.

మధుకరుఁడు—చిత్తము. (నిష్క్రమించును.)

అజాతశత్రుఁడు—దేవదత్తా ! ఇల్వలాంగులీమాలు రేమి సామాన్యులుగారు. మన నియమించు కార్యమును దప్పక నెఱవేర్పఁగలరు.

ప్రతీహారుఁడు—(ప్రవేశించి) రాజమాత క్షేమాదేవి యమ్మగారు దేవరవారిని రా వేఁడుచున్నారు.

దేవదత్తుఁడు—మిత్రమా ! తండ్రిని జెఱవిడిపింప వలె నని మీ తల్లి నిన్ను వేఁడవచ్చును. కాని, పట్టు వదలకుము. ఇప్పు డతనిఁ గారా విముక్తుని జేసినచో మనప్రయత్నము లన్నియు మంటఁ గలయును. పరాకు.

అజాతశత్రుఁడు— నేను దాని కొప్పుకొననులే. (నిష్క్రమించును.)

దేవదత్తుఁడు— నే నానాఁడు ప్రతిజ్ఞచేసినదాదిగా బుద్ధుని కెగ్గుచేయుచునే యున్నాను. గృధకూటగిరియందలి యొక సెలయూటలో వాఁడు తన కాషాయాంబరముల నుదికికొనుచుండఁగా, వానిపైఁ బెద్దశిలనుగూడ వేసితిని. కాని వాఁడు దానిని దప్పించుకొనెను. ఈచోరుల చేతిలో వాని మరణముండ, వాఁడప్పుడే యెట్లు చచ్చును ?

ఓరీ ! బుద్ధా ! దుష్టమత ప్రాపకా ! అపరిశుద్ధా ! నిన్నుఁ బ్రపంచమున మన నిత్తునా ?

(నిష్క్రమించుచున్నాఁడు.)

రంగము. 3. ఉరుబిల్వారణ్యము.

(అంగులీమాలుఁడు సమీప మందలి చెట్టెక్కి బుద్ధుని రాకను జూచుచుండును. ఇల్వలుఁడు చెట్టుక్రింద నుండును.)

అంగులీమాలుఁడు— (పరికించి చూచుచు బిగ్గఱగా) ఇల్వలా ! ఈ సన్న్యాసుల గుం పెంత పెద్దది ! సన్న్యాసులు చెదలవలె బారులుదీరి నడతెంచుచున్నారు; రెండు పఱువుల దూరమున నున్నారు. వారిక్కడికి రాఁగానే మన మెలుఁగుల మై వారిపైఁ బడి వారిని నాశము చేయవలెను.

ఇల్వలుఁడు— (బిగ్గఱగ నవ్వుచు) పిచ్చివాఁడ! ఆగుంపు జోలి మన కేల? బుద్ధుఁడెక్కడ నున్నాఁడో చూడు.

అంగులీమాలుఁడు—(బిగ్గఱగ) గుంపు బహుదూర మున నుండుటచే వ్యక్తులను గుర్తించుట సాధ్యముగాదు.

ఇల్వలుఁడు—అట్లయిన దిగు; మఱిచూతము.

అంగులీమాలుఁడు—(చెట్టు దిగి) ఇల్వలా ! నీ వంతు పని చేయుటకు సిద్ధపడి యున్నావుగదా.

ఇల్వలుఁడు— అంగులీమాలా ! అజాతశత్రు మహా రాజును, దేవదత్త ప్రభుఁడును, మనతోఁ జెప్పినప్పటినుండి, బుద్ధుని రుచ్యములగు రక్త మాంసములను మెక్క వలెనని మూఁడు దినములుగా నల్పాహారమునే గైకొనుచున్నాను. కాని, నా యాఁకలి యేటికో చచ్చినది.

అంగులీమాలుఁడు—నాకును మన స్సొక్కతీరున నున్నది. (తన మెడలోని యంగులీమాలను జూపుచు) ఇల్వలా!

ఈమాలను జూడు. దీనిలో నెన్ని యంగుళము లున్నవో యెఱుఁగుదువా ?

ఇల్వాలుఁడు—నూఱాఱు లున్నవి.

అంగుళీమాలుఁడు—ఈ యంగుళు లన్నియు నేనీ కరవాలముచే శిరఃకర్తనముగావించిన ప్రముఖజనులవిమాత్రమే. ఇట్టి దట్టనగు నాకు, ఈ బుద్ధుని శిరఃకర్తనము తలపెట్టినది మొదలు, నా మనస్సులోఁ జెయిపెట్టి కలఁచిన ట్లున్నది.

ఇల్వాలుఁడు—ఇంకొకసారి సారాతిత్తి నోటికెత్తుము.

అంగులీమాలుఁడు—ఇంతలో మూఁడుసారు లాయెను; మత్తు గలుగదు. మత్తు గలిగినఁ గాని, నాచేతి కత్తి పని చేయదు. తిత్తిలోని మద్యము తగ్గిన కొలఁదిని నా ధైర్యసారము తగ్గుచున్నది. కానీ; ఈ సారి చూతము; నీవును గొంచెము త్రాగుము; నేనును ద్రాగెదను. (తన నడుమున వ్రేలుచుండు సారా తిత్తిని నోటికెత్తి త్రాగును.)

ఇల్వాలుఁడు—(తన నడుమున వ్రేలు సారాతిత్తిని నోటికెత్తి కొంచెము రుచిచూచి) సారా గాటుగనే యున్నది.

అంగులీమాలుఁడు—కాని, యేమి ప్రయోజనము? కాదంబరికి మనమీఁద దయ దప్పినది. ఇల్వాలా! నీతిత్తిని గూడఁ దెమ్ము. వీని నీ యీఁతచెట్టు క్రిందఁ బెట్టి ప్రార్థనలు చేయుదము. (ఇల్వాలుఁడును, అంగులీ మాలుఁడును దమ సారాయి తిత్తులను నీఁతచెట్టు మొదట నుంతురు.)

(దండకము)

శ్రీ మన్మహాశక్తి కాదంబరీ! నిన్ను నే స్తోత్రముం జేయఁగా నెంతవాఁడన్? భవద్దీప్త సారంబు హృత్క్రోడమందుం బ్రవేశింప ధైర్యంబుఁ గల్గించు, శౌర్యంబుఁ బోషించు, క్రౌర్యంబుఁ గీలించు, క్రోధాగ్ని మండించు, భోగేచ్ఛ హెచ్చించు, మాంద్యంబుఁ దగ్గించు, దుఃఖంబుఁ బోకార్చు, నానందముం గూర్చు, బ్రహ్మంబుఁ జేకూర్చు; శారీరసామర్థ్య మెచ్చించు; కొంచెంబు కొంచెంబుగా స్వీకరింపంగ నెంతేయుఁ బుద్ధి నైశిత్యమున్ వృద్ధిపొందించు; కాఁబట్టియే కాదె చోరుల్, నిహంతల్, కిరాతుల్, విటుల్, జారిణుల్, స్వైరిణుల్, ధీమణుల్, జూదరుల్, వేఁటకుల్, పోటకుల్, నిత్యము న్నిన్ను సేవింత్రు. నీశక్తి కాళమ్మ, మారమ్మ, చండమ్మ, యూరమ్మ, దుర్గమ్మ మున్నైన యీ యమ్మ లందుం బ్రతిష్ఠించి, లోకంబు వారల్ నినుం బూజగావింత్రు; కాదంబరీ! నీవు కారుణ్యదృష్టిన్ నన్నుం గాంచి, నా యుత్తమాంగం బధిష్ఠించి, వక్త్రంబు రంజించి, నా యంతరాత్మం గడుం బ్రేమ జోకొట్టి, యుయ్యాల లూపించి, నిద్రాణముం జేసి, యంగంబు లందెల్ల నీసారముం దింపి, నీశక్తిలో నింపి, యీకార్యభారంబు నే నిర్వహింపంగఁ జేయంగదే హృద్యమా మద్యమా! నిన్నదే మ్రొక్కెదన్ మ్రొక్కెదన్ మ్రొక్కెదన్.

(ఇద్దఱు దండ ప్రణామములు గావింతురు.)

ఇల్వలుఁడు—అంగుళీమాలా! నాపుఁ దరుగఁబడకుండ నా పొట్టనింత వేఁడుకొందును

(దండకము)

ఓ పొట్ట! నీతిత్తిలో లెక్కకున్ మిక్కుటంబైన పీనుంగులం బెట్టి నిన్గోరిగాఁ జేయ నీలోని పుర్వుల్ గడు న్వింతగా వాని నిశ్శేషముం జేయు, నీశక్తి యత్యద్భుతం బయ్యె నిప్డేల యీ బోడనున్ మ్రింగఁగా జంకు

చున్నావు? నీకేమి సన్న్యాసులన్ మెక్కుటల్ గ్రొత్తయా? రాజులం గుద్చుటల్ గ్రొత్తయా? స్త్రీల భక్షించుటల్ గ్రొత్తయా? గ్రొత్త యిం దెద్దియున్ లేదె; అట్లుండియు న్నీవు వెన్నాడఁగా నేల? నీ చిచ్చు హెచ్చింపఁగా నెంచి మూన్నాళ్లుగాఁ గొద్దిగాహారమే స్వీకరింతుంగదే పొట్ట! ఇంతయ్యు నీవేళ నీ మాంద్యముం బొందఁగా నేల? ఓ కుక్షి! యక్షిణ రాక్షత్వముం బూని యీ క్షత్రియాత్ముద మాంసంబు భక్షించి, రక్తంబునుక్ జుర్రి, నా దీక్ష సంపూర్తి గావించి, నా కీర్తి సంక్షీణతం జెందకుండంగ రక్షింపవే నిన్ను నే మ్రొక్కెదన్ మ్రొక్కెదన్ మ్రొక్కెదన్.

(తన పొట్టకు నమస్కరించును.)

అంగుళీమాలుఁడు—(సారాయి తిత్తులను గైకొని) ఇప్పుడు మరలఁ ద్రాగుద మెట్లుగాకునో. (ఇల్వలునికి వాని తిత్తి నిచ్చును.)

ఇల్వలుఁడు—ముందుపని గావలసి యున్నది. సారా యితోడనే పొట్ట నింపుకొన్న నెట్లు? నీవు ద్రాగుము.

అంగుళీమాలుఁడు—ఆఁకలి హెచ్చించునులే; కొంచెము ద్రాగుము. (తాను ద్రాగును.)

ఇల్వలుఁడు—(కొంచెము ద్రాగి) త్రాగిన కొలఁదిని పాలు త్రాగినట్లయి నా కాఁకలి తగ్గుచున్నది.

అంగుళీమాలుఁడు—సారాయికి సారా గుణమే పోయి నది.

ఇల్వలుఁడు—అంతయుఁ దారుమా రగుచున్నది!... ఈ సన్న్యాసుల గుం పెంత దగ్గఱ వచ్చినదో.

అంగుళీమాలుఁడు—(చెట్టెక్కి చూచుచు బిగ్గఱగా) గుంపింకను బఱుగుదవ్వల నున్నది. ఇల్వాలా! ఇల్వాలా! ఎవ్వరో కొందఱు ముందు నడచి వచ్చుచున్నారు! ఇక్కడికిఁ జాల దగ్గఱనే యున్నారు.

ఇల్వాలుఁడు—(బిగ్గఱగా) నీవు బుద్ధు నెఱుఁగుదువు గదా. వారిలో బుద్ధుఁ డొక్కఁడేమో చూడుము.

అంగుళీమాలుఁడు—(పరికించి చూచి బిగ్గఱగా) ఓహో! ఇల్వాలా! వీరిలో బుద్ధుఁ డున్నాఁడు నుమా. ఆతని వెంట ... ఇద్దఱున్నారు. ఆ యిద్దఱిలో నొక్కఁడు తోడి సన్న్యాసియె. ఇంకొక్కఁడు ... సన్న్యాసి గాదు; ముందు నడచి దారి చూపుచున్నాఁడు; సేవకుఁడు కాఁబోలు. (చెట్టు దిగి) వీరు మిక్కిలి దగ్గఱ నున్నారు. కాని, బుద్ధుని రాకవలన నా మనస్సేమో సూర్యుని డాయు రాత్రివలె నున్నది.

ఇల్వాలుఁడు—తిత్తి యెత్తి మఱియొకసారి నోటికి గొట్టము పెట్టుము.

అంగుళీమాలుఁడు—(త్రాగి) నీరు త్రాగి నట్లున్నది!. ఇల్వాలా! అదే చూడు, వా రిట్లే వచ్చుచున్నారు.

ఇల్వాలుఁడు—నీవు బుద్ధుని పైఁబడి కన్నులను, మనస్సును, మూసికొని వాని కంఠము నఱుకుము. నే నెట్లో కాఁ జేసెదను.

అంగుళీమాలుఁడు—కన్నులు మూసికోవచ్చును గాని మనస్సు మూఁత పడుట లేదు.

ఇల్వాలుఁడు—బలవంతముగ మూఁత వేయుము.

అంగులీమాలుఁడు—ఇప్పు డది పొసఁగదు. ఈ కుందేళ్లు వంట యిల్లు చొచ్చినవి; ఇం కెందుఁ బోవఁగలవు ? మనమా గుహాలోఁ బొంచి యుండి కొంచెము తాళి పనిచేయుదము. (ఇరువురు నట్లు చేయుదురు.)

(హారిజాతుఁ డను మార్గదర్శి ముందు నడచుచుండ, దండ కమండలువులు ధరించిన బుద్ధుఁడు తన శిష్యుఁడగు శారిపుత్రునితోఁ బ్రవేశించును.)

బుద్ధుఁడు—శారిపుత్రా ! ఏమంటివి ?

శారిపుత్రుఁడు—మన గమనము నింత మందగింతము.

బుద్ధుఁడు—నీకు గమనాయాసము గలిగినదా ?

శారిపుత్రుఁడు— లేదు లేదు; శ్రమణబృందము చాల వెనుకఁ బడియున్నది.

హారిజాతుఁడు—సామీ! ఈ కాడనుండి అడవి; సీఁకటి సెనా; దోవ బెయంగా వుంటాది. సాములో ళ్లంతా వొచ్చే దాఁకా యీడనే కూకుందాము సామీ !

బుద్ధుఁడు—అంగులీమాలుఁ డను దొంగలఱేఁ డుండు ప్రాంత మిదేనా ?

హారిజాతుఁడు—(నిలిచి) ఆ కొండఁల్లోనే సామీ వాళ్లుండేది. పోతూపోతూ సెట్లుసెనా, సీఁకటి సెనా, కొత్తోళ్లకి దోవ సిక్కేదే కట్టం. వంకలు, వాఁగులూ, రాళ్లు, రప్పలూ, సెట్లులు గుట్టలూ, గవులు, పులులూ వుంటాయి సామీ ! (సమీపమందలి కొండగవిని గాంచిన బుద్ధుఁడు దాని వైపు పోవుచుండుట చూచి) ఓ సామి ! నాసామి

ఔఁడా ! గవికాటికేల పోతారు ? అట్టా గవుల్లోనే పులులుం
టాయి; పులులకంటె సెడ్డోళ్లు దొంగ లుంటారు.

బుద్ధుఁడు— (ఇంచుక దూరమునుండియే గవిలో మను
ష్యు లుండుట చూచి, తనలో) ఓహో ! ఈ దొంగ లిందే
యున్నారు ! (అని ప్రక్కకుఁ దిరిగి, గవిప్రక్కగా దూరముగాఁ
జెట్టుక్రిందికిఁ బోయి, ప్రకాశముగా) అంగులీమాలుఁ డిందు
న్నను భయములేదు. శ్రమణు లందఱు వచ్చువఱ కిందే
యుందము. (కూర్చుండును.)

(శారిపుత్రుఁడును, హారిజాతుఁడును, బుద్ధుఁడు కూ
ర్చున్న చోటికి నడతురు.)

శారిపుత్రుఁడు—(హారిజాతునితో) అంగులీమాలుఁ
డంత క్రూరుఁడా ?

హారిజాతుఁడు— అదుగుతానా సామీ ! వాళ్ల గుంపు
లో నూటాఱుమం దున్నారు. వాళ్లలో ఇల్వాలూఁ డనేవాఁ
డుండాడు సామీ; వాఁడు మనిసి రగతాన్నల్లే జుఱ్ఱని జుఱ్ఱ
తాఁడు, మాంసాన్ని తింటాఁడు. ఒకళ్లిద్దఱు సిక్కితే వాళ్ల
నాడే సంపి రగితం తాగుతాఁడు. జనం సెనా వుంటే, వాళ్లను
తప్పుదోవ పట్టించి, యా కొండపై యాడనో వుండేవాళ్ల గవి
లోకి వాళ్ల నీమ్ముకో పోతారు. యారూ దోవలో సిక్కాకపోతే
రేయిలో వూళ్లపై పడతారు. జీవాల్ సిక్కితే జీవాళ్నే,
మనిసిల్ సిక్కితే మనిసిల్నే లేపుకోపోతారు సామీ ! బలే
దొంగ లుండారు సామీ యీళ్లు, (హారిజాతుఁడును, శారిపు
త్రుఁడును బుద్ధునికడకు వచ్చి, గుహకు వీఁపు చేసి కూర్చుందు
దురు. అంగులీమాలుఁడును, ఇల్వాలుఁడును గుహాముఖమునకు

జరిగివచ్చి, వారి మాటలు వినుచు, మీసలు దువ్వుచు బండ్లు కొఱుకుదురు.)

శారిపుత్రుఁడు—హారిజాతా! దిగులుపడ నేల? కర్మ ఫలము ననుభవింపవలసిన దే కదా.

హారిజాతుఁడు—ఏమో సామీ! నే న్నేదోణ్ణి, బిక్ష లోణ్ణి. ఇంతమంది సన్నాసులు దొడ్డోళ్లు పోతావుండి యీ యడవిలో దోవ సూపేదాన్కి మావూరి పెద్ద పొమ్మంటే మేమ్ నల్గు రన్నదమ్ము న్నాండ్లు వచ్చిండాం సామీ!

శారిపుత్రుఁడు—వెనక గుంపుతో వచ్చువారు నీ సో దరు లేనా?

హారిజాతుఁడు—ఔ సామీ! వాళ్లు నాయన్నలు. ఈ దొంగల పెద్ద యంగులీమాలూఁడు సింబం వంటోఁడు సామీ! ఇలువాలూఁడు పులాంటోఁడు సామీ!

బుద్ధుఁడు—కర్మ పరిపక్వ మైనప్పుడు సింహమే గొఱ్ఱె యగును; పులియే పిల్లి యగును.

(ఈ మాటలు వినుచున్న దొంగలు పటపట పండ్లు గొఱుకుదురు.)

శారిపుత్రుఁడు—తమ దివ్య బోధామృతము వా రాస్వాదింప నబ్బె నేని, తమరు సెలవిచ్చినట్లు జరుగుట కెట్టి సందేహమును నుండదు.

హారిజాతుఁడు—దనం దోపిడీ సేయడం, సంపడం, రగతం తాగడం, మాంసం తినడం, ఇవే వాళ్లికిఁ గావల్సింది. మీరు సెప్పే బుద్దిమాట వాళ్లింటారేం సామీ?

(దొంగలు కత్తులు దూయుదురు.)

బుద్ధుడు—వారును మనుష్యులే గదా? మనకువలె వారికిని గన్నులుఁ జెవులు నున్నవిగదా?

హారిజాతుఁడు—ఉండాయి.

(ఇల్వ్వలుఁడు ముందంజ వేయఁబోఁగా నంగుళీమాలుఁడు వలదని సైఁగ సేయుచున్నాఁడు.)

బుద్ధుడు—కను లెప్పుడును జీఁకటినే యభిలషింపవు; చెవు లెప్పుడును దిట్లనే వినఁగోరవు. వారికి హృదయమున్నది గదా? మన స్సున్నది గదా?

హారిజాతుఁడు—ఉండాయి సామీ! అవన్నీ యారు లేదంటారు? అందఱూ పుట్టిండేటట్లే వాళ్లూ పుట్టిండారు. నా నింకా మాలోణ్ణిసామీ! అంగుళీమాలూఁడిది మంచి బాపనకులం. ఇలువాలూఁడి దంటేనో రాచకులం సామీ!

శారిపుత్రుఁడు—అట్లసా? అట్టివా రెట్టి యసాధువృత్తికి దిగినారు!

(దొంగలు గవిముంగల కించుక వచ్చి పటపట పండ్లు కొఱుకుదురు.)

బుద్ధుడు—మానవుని ముఖ్యచిహ్నము వాని కర్మ గాని, వాని జాతిగాదు.

హారిజాతుఁడు—వాళ్లకేం వెంకిల్లే వెండముల్లే. ఆఁడోళ్లు సిక్కితే యీడ్సుకో పోతారు; తమకాడ వుండే సామ్ముల్తో దనంతో వాళ్లని నింపుతారు. వాళ్లకాడ దనం సెనా వుండాది సామీ!

బుద్ధుఁడు—వారి కడకంటె నీ కడనే ధన మధికముగా నున్నది. (హారిజాతుఁ డాకులపాటుతోఁ జూచును.) వారే నీ కంటెఁ బేదవారు. ఏలన నీయందు దయయున్నది. ఈ దయాధనము నందఱ కిచ్చి వారిని సంతుష్టి చేయుదువు. ఇది యిచ్చువానిని, పుచ్చుకొనువానిని నుభయులను ధన్యులం జేయును. ఈ దయాధనము తఱుగునదిగాదు; ఇచ్చుకొలఁదిని వృద్ధి నొందునది. (అంగుళీమాలుఁడును, ఇల్వలుఁడును గవి ముంగలకు వచ్చి, బుద్ధాదులకుఁ గనఁబడకుండ నిలిచి పినుట నభినయించి, పండ్లు కొఱుకుచుఁ గత్తుల ఝుళిపింతురు.)

హారిజాతుఁడు—నీవు సెప్పేది నాకి కొంచ కొంచం తెలుస్తాది సామీ!

బుద్ధుఁడు—అంగుళీమాలుఁడును, నళిని యనుచరుఁడును, నిందుండినచో, వారు నేఁ జెప్పుదానిని బాగుగా గ్రహింపఁ జాలియుందురు.

హారిజాతుఁడు—సెప్పండి సామీ! నాన యింటాను.

బుద్ధుఁడు—మానవుఁడు చెడుకార్య మొక్కసారి యాచరించిన, దానియందే వానికాసక్తి మొదయి, యభ్యాసవశమున మరల మరల దానినే యాచరించుచుండును. కొంత కాలమునకు దాని ప్రభావమునకు వాఁడు లొంగిపోవును.

హారిజాతుఁడు—ఔ సామీ! అది నిజం. నాకు నుట్ట తాగే అబ్బేసం అట్లె అబ్బిండాది సామీ!

బుద్ధుఁడు—త్రాగుడు నట్లే యభ్యాసవశమునఁ బట్టు పడును. త్రాగుడునం దొక్కటైనను మంచిగుణము లేదు; పెక్కు చెడ్డగుణము లున్నవి. ఈ చెడుగుణములు, త్రాగుఁ

బోతు దా ననుభవించుటయె గాక, తన పదితరముల సంతతి వారికిని సంక్రమింపఁ జేయును.

హరిజాతుఁడు—తాగే అబ్బేసం నాకు లేదు సామీ!

బుద్ధుఁడు—దుష్టకర్ముఁడు తన దుష్కర్మ ఫలించు దనుక మోదముం బొందును; కాని, వాని దుష్కర్మము పరి పక్వస్థితికి వచ్చునప్పుడు, దానికై వాఁడు దుఃఖముం బొందును.

హరిజాతుఁడు—సుట్ట తాగే అబ్బేసం నాకెట్లా పోతాది సామీ?

బుద్ధుఁడు—చుట్ట త్రావుట చెడ్డదని నీ బుద్ధి నీకుఁ దెలుపుచున్నది. అది యెఱుంగుటయె నీయందు విశేషము. మఱి, దాని నేల వదలలేకున్నాఁడవన, దానిఁ ద్రాగుటచే నీకుఁ గలుగు మోదము దానిని విడువవలెనను నాసక్తికంటె నెక్కు వగా నీ మనస్సునం దున్నది. నీ మనస్సులో దానిని విడువవలె నను దృఢసంకల్పము చేయుము; అనఁగా, ఆ కోర్కెను నీ మనస్సు జయించునట్లు చేయుము. అప్పు డలవాటు వదలును. మనస్సునందుఁ దక్క, ఆకసంబునఁగాని, సముద్రంబునఁగాని, పర్వత కందరస్థలు లందుఁగాని, భూతలంబున మఱి యెచ్చో టనుగాని, మనుష్యుఁడు స్వకృత పాపవిముక్తినిఁ బొందు ప్రదేశంబు లేదు.

హరిజాతుఁడు—(కనులు మూసికొని) నాను మన స్సులో గెట్టి నేసిండాను సామీ! ఇ య్యాలనుండి సుట్ట తాగను, తాగను, తాగను. (అని కన్నులు తెఱచి, తనయొద్ద

నుండు చుట్టలు మున్నగువానిని బాఱవేసి, మొదట బుద్ధునికిఁ బిదప శారిపుత్రునికిని నమస్కరించును.)

బుద్ధుఁడు—నీ కాత్మజయంబు ప్రాపించుఁగాక. (ఆశీర్వదించును.)

శారిపుత్రుఁడు—నీవు నీ మనస్సును జెడుకార్యము నుండి మరలించుకొని, పుణ్యము పరిగ్రహించు దానినిగాఁ జేసితివి. ధన్యుఁడవు. (ఆశీర్వదించును)

బుద్ధుఁడు—చుట్ట త్రాగుట, హింసయంత చెడు కార్యము గాదు. హింస యధర్మము, పాపము.

హారిజాతుఁడు—ఇంచ, ఇంచ.

బుద్ధుఁడు—హింస. ఒరున కేవిధమైన బాధను గలిగించినను, అది హింస యగును. అనపరాధులను హింసించువాఁడు చంద్రుని దిక్కు మన్ను చల్లువానివలెఁ దానే బాధ పడును.

(ఇది విన్న యంగుళీమాలుఁడును, ఇల్వలుఁడును గేకలువేయుచుఁ గత్తుల ఝళిపించుచు బుద్ధుని సమీపింతురు. హారిజాతుఁడు పాఱిపోయి యొక పొదరింటిలో దాఁగికొనును. శారిపుత్రుఁడు లేచి నాలుగడుగులు వెన్కకుఁ బోవును. బుద్ధుఁడల్లె కూర్చుండి తన యుపదేశమును సలుపక సాగించును.)

హింసకు మూలబీజము దయలేమియె. దయయే ప్రేమ. తృష్ణను నశింపఁజేయునది ప్రేమయె.

శారిపుత్రుఁడు—(భయమున) ఓ గురుదేవా! గురుదేవా!

బుద్ధుఁడు—(యథారీతిగ) కామ క్రోధాదిగాఁ గల యంతరరులను నడంచునది ప్రేమయె. నిత్యసుఖము నిచ్చునది ప్రేమయె. సర్వసమత్వ మిచ్చునది ప్రేమయె. ప్రేమయే...

అంగుళిమాలుఁడు—ఇప్పుడు నిన్నుఁ జంపెద నేమందువు? (కత్తి యెత్తును.)

శారిపుత్రుఁడు—(భయముతోఁ జేతు లెత్తి) గురుదేవా! ఓ గురుదేవా!

హరిజాతుఁడు—(పొదరింటిలోనుండి నిక్కి చూచుచు) అయ్యో! అయ్యో! సామీ! అయ్యో!

బుద్ధుఁడు—సోదరా! ఇప్పుడును నిన్నుఁ బ్రేమించుచున్నాను. నీవు నన్నుఁ జంపినను నేను నిన్నుఁ బ్రేమింతును.

అంగులీమాలుఁడు— (కత్తిదించి శారిపుత్రునితో) ఇతఁడెవఁడు? పిచ్చివాఁడా యేమి?

శారిపుత్రుఁడు—ఇతఁడు బుద్ధాచార్యుఁడు. ప్రేమ విషయమైన పిచ్చి యతనికి మెండు. నాకును నట్టి పిచ్చి కొద్దిగ నున్నది.

ఇల్వలుఁడు—అంగులీమాలా! వీఁడు బుద్ధుఁడైనఁ జంపుము, నఱుకుము.

అంగులీమాలుఁడు.—ఇల్వలా! కొంచెము తాళుము.

బుద్ధుఁడు—(అంగులీమాలునితో) అయ్యా! నీవేనా యంగులీమాలుఁడవు?

అంగులీమాలుఁడు—అవును. నాతో సంబంధము చేయుచున్నావా?

బుద్ధుఁడు—మనకు సంబంధ మున్నది. మన మంద ఱము భూజనయిత్రియందుఁ బుట్టినవారము. కావున, నీవు నా సోదరుఁడవు. నిన్నుఁజూడ నాకు జాలి కలుగుచున్నది.

అంగుళీమాలుఁడు—నీవు నా చేతఁ జావ నున్నావు గదా యని నాకును జాలి వేయుచున్నది. (కత్తి యెత్తును.)

శారిపుత్రుఁడు—ఆఁ! ఆఁ! ఏమి చేయుదును? (పరవశత్వమునఁ గన్నులు మూసికొనును.)

పారిజాతుఁడు—(అంగుళీమాలుఁడు కత్తి యెత్తుటను గాంచి, రొమ్ము బాదికొని దుఃఖమును భీతిని నభినయించుచు) అయ్యో! అయ్యో! సామీ! నా సామితేఁడా!

బుద్ధుఁడు—(జంకక) నీచేత నేను జచ్చుట నా కానందము; అంగుళీమాలా! ఇల్వాలా! ఇదే నా హృదయము. దీనిం జీల్చుఁడు. నన్నుఁ జంపిన పిదపనైన మీ హృదయములందు జాలి పొడమిన నేను గృతార్థుఁడ నగుదును. ఒకవేళ జాలి గలుగక పోయినను నన్నుఁ జంపుటచే మీ కాత్మసంతోషము గలిగిన, అట్లును నేను ధన్యుఁడను. ఇదే మీకై నా యాత్మార్పణము చేయుచున్నాను. (తన యెద చూపును.)

అంగుళీమాలుఁడు—(ఇల్వాలునితో) నే నెందఱో మానవులను జూచి యున్నాను గాని, యిట్టి లోక విపరీతమైన హృదయము గల మానవుని జూచి యెఱుఁగను. తన ప్రాణముల నర్పించుటయం దెంత త్యాగమును జూపుచున్నాఁ డీ మహానుభావుఁడు! ఎంత యానందమగ్నుఁ డగుచున్నాఁ డీ జినుఁడు! హాహా! మన మెంత పాపులము!! (బుద్ధుని మొగము వంకఁ జూచుచుఁ జేతనున్న కత్తిని జాఱవిడుచును.)

ఇల్వాలుఁడు—(తన కత్తిని నేలమీఁద వైచి) ఏమిది! మన సెట్లో యగుచున్నది!

శారిపుత్రుఁడు—(తనలో) ఆహా! సంభాషణ మాత్రముచేతనే యెట్టివారినైనను సాధువులఁ జేయు నీ మహాత్మ్ముని ప్రేమ ప్రసరణ్నైకశక్తి నేమందును!

బుద్ధుఁడు—సోదరులారా! మీ హృదయము లింకను వజ్రకాఠిన్యము వహించి యుండలేదు. ప్రేమరస మందందుఁ జింది యుండుటచే నవి మృదువులైయే యున్నవి.

ఏక పదార్థమగు జలము, సముద్రముగను, సెలయేఱుగను, తరంగములుగను, బుద్బుదములుగను, శీకరములుగను, ఆవిరిగను, వర్షముగను, మేఘములుగను, రూపందునట్లు, ప్రేమయే మైత్రిగను, సత్యాగ్రహముగను, అనురాగముగను, మోహముగను, వాత్సల్యముగను, త్యాగముగను, ఆనందముగను, భక్తిగను బరిణమించును. మీయందలి ప్రేమ మిప్పుడు భక్తిరూపమును బొందియున్నది.

అంగులీమాలుఁడు, ఇల్వాలుఁడు—మహాత్మా! మేమంధులము. తారకమార్గమును జూపి మమ్ముద్ధరింపుము. (అని వారు తమ చేతులతోఁ దమ కన్నులు మూసికొని బుద్ధుని పాదములమీఁదఁ బడుదురు. అది చూచిన హరిజాతుఁడు పొదరింటిని వదలి, తిన్నగ వీరుండుతావునకు వచ్చును)

బుద్ధుఁడు—సోదరులారా! మీ హృదయములందలి ప్రేమ జ్యోతి యారిపోలేదు. అది వెలుఁగుచునే యున్నది. కాని మందముగ వెలుఁగుచున్నది. దానిని స్నేహముచేఁ బోషించి ప్రజ్వలింపఁ జేయుఁడు. అదియే మీకుఁ దారక

మార్గమును జూపును. (వారి తలలపైఁ జేతులు సాచి) మీరు పవిత్రు లైతిరి. (వారిని లేవనెత్తి) నేను నుడువుచుండిన యహింసా ప్రేమ మహాత్మ్యములను మొదటినుండియు మీరు విన్నారు గదా.

అంగులీమాలుఁడు, ఇల్వలుఁడు — (ఆశ్చర్యముతో నొండొరుల మొగము చూచికొనుచు) విన్నాము దేవా! విన్నాము.

బుద్ధుఁడు—హింస వదలుఁడు. ప్రేమామృతమును మీ హృదయ శంఖముల నింపుఁడు. నిరర్గళ హృదయ శంఖము నుండి వెలువడు ప్రేమామృతమే పునీత మగుట, అది చల్లిన ప్రదేశములెల్లఁ బవిత్రవంతము లగును. అదియే హింసను మాన్పి చిత్తశాంతి నొసంగును.

అంగులీమాలుఁడు, ఇల్వలుఁడు—మహా ప్రసాదము.

అంగులీమాలుఁడు—(చేతులు జోడించి) మహాత్ములారా! నా ప్రార్థన మొక్కటి యున్నది. ఆ కొండయందు మా నివేశ మున్నది. అక్కడికిఁ దాము సపరివారముగా విజయంచేసి, మా యొసంగెడి యాతిథేయార్చనలం గైకొని, మా కందఱకు బోధామృతము పోసి, మఱి ప్రయాణము సాగింతురు గాక.

ఇల్వలుఁడు—దేవరవారి సెలవైన శ్రమణ పరివారమున కెదురుగాఁ జని, వారల నక్కడికే తోడితెత్తును.

బుద్ధుఁడు—అట్లే చేయుము. (హరిజాతునితో) అయ్యా! నీవు భయపడవలదు. నీ వితని వెంబడి చని వెనుక వచ్చు శ్రమణబృందముం గలిసికొని, అందుండు కౌండిన్యుఁడు, ఆనందుఁడు, మొగ్గలానుఁడు, ననువారితో నా మాటగా నిట్లు చెప్పుము: 'అంగులీమాలుఁడు తన నివేశమున మన కతిథిసత్కార మిచ్చును గావున, నందఱు నక్కడకే రావలయు' నని.

హరిజాతుఁడు, ఇల్వలుఁడు—చిత్తము. (నిష్క్రమింతురు.)

అంగులీమాలుఁడు—ఇటు, ఇటు. (అంగులీమాలుని వెంట బుద్ధుఁడు, శారిపుత్రుఁడు వేఱుదారిని నిష్క్రమింతురు.)



# గౌతమ బుద్ధుఁడు.

---

## సప్తమాంకము.

### రంగము 1. కపిలవస్తు పురము. సురమ యను ప్రాసాదపుఁ జంద్రశాల.

(యశోధరయు నామె చెలికత్తె యగు చంద్రికయుఁ గూర్చుండి బుద్ధుని రాకను నిరీక్షించుచుందురు.)

యశోధర—చెలీ ! చంద్రికా ! న్యగ్రోధవన మిప్పు డెంత రమణీయముగ నున్నదే ! చెట్ల శిఖరంబుల నుండి శిఖరంబులకుఁ బ్రాఁకు పుష్పవల్లీఁగెలు సహజ తోరణములై యుండఁగాఁ గలువడముల తోడను, క్రముక రంభాస్తంభ పూర్ణకుంభముల తోడను, పటకుటీరముల తోడను, జన సమూహముల తోడను, అది యలంకృతమై, సహజ సౌందర్యము గల కాంతకు సొమ్ములు పెట్టినట్లు సొంపునఁ బెంపు వహించుచున్నది.

చంద్రిక—ఆ ముందటి భాగమందలి హారిద్రావర్ణము గల పటకుటీరమె బుద్ధప్రభుని కేర్పఱుపఁ బడినది. దాని చుట్టును నుండు హారితవర్ణము లవి యైయును, ఆతని ముఖ్యశిష్యులకును, తక్కినవి తెల్లవన్నియుఁ దదితర శ్రమణులకును నేర్పఱుపఁ బడినవి.

యశోధర—ఆ వంపు దిరిగిన బాటల కిరుగడల వరు
సలు దీర్చి, అంత స్తులుగా రచింపఁబడిన యా పీఠములపైఁ
గూర్చున్న యా పిల్లలెవరు ?

చంద్రిక—వారు శాక్యాది రాజవంశజు లగు బాలికా
బాలురు. బుద్ధప్రభుఁడు తన విడిదికిఁ జనుచో, ఆతనిపై సేసలు
చల్లి సుస్వాగత మిచ్చుటకు నియమింపఁ బడినవారు.

యశోధర—ఏమి యా దృశ్య రమణీయత !

ఉ. అంబర చుంబనంబున నిరంతర ముండెడి యింద్ర చాప మే
యంబర వీథి డిగ్గి వసుధామల రమ్య తలంబుపైనఁ జి
త్రింబుగ వ్రాలెనో యనఁగ రత్న విభూషణ నూత్న చిత్రవ
ర్ణాంబరధారులీ యవనిపాత్మజ బృందము చూడ నింపగున్.

ఆఁ! ఎందఱు జానపదులు వచ్చి, బాట కిరు గడల
మూఁగియున్నారు ! ఆ బాట మధ్యమందలి గుంపు మన పౌరు
లదే గదా ?

చంద్రిక—అందు మీ మామగారగు శుద్ధోదన మహా
రాజుగారు నిజబంధు మిత్రామాత్యాది పరివారముతో బుద్ధ
ప్రభుని రాకకై వేచియున్నారు. (ముందువంకఁ జూచి)అదిగో!
పై కెగసిన ధరాధూళి వింత వన్నెలుగాఁ గనఁబడుచున్నది.
శ్రమణులు శ్రేణులుగట్టి వచ్చువారు. వార లిరువది వేవు
రున్నారఁట !

యశోధర—వారిది పెద్దగుంపే ... మంగళవాద్యము
లింకను మ్రోఁగుట లేదు. బుద్ధమహానుభావుఁ డింకను వెన్క
నుండును. శ్రమణ శిష్యులు గుంపులు గుంపులుగా ముందు
వచ్చుచున్నారు.

**తే. విమల కాషాయధరు లగు శ్రమణచయము**
**లగ్రగాములై తెల్పు బుద్ధాగమంబు;**
**సింధురపుఁ గిరణ తతులు ముందుఁ దోఁచి**
**బాలసూర్యాగమ మెఱుక పఱచునట్లు.**

చంద్రిక—బుద్ధమహానుభావుని దర్శన గౌరవము కపిల వస్తుపురమునకుఁ గలుగుట గొప్పభాగ్యమే.

యశోధర—దేవతలు నా ప్రార్థనము లాలించి నన్నను గ్రహించినారు.

చంద్రిక—నీ వనుగ్రహింపఁబడినదాన వనుట ముమ్మాటికి నిజమె.

యశోధర—చెలీ! మొదట నా హృదయపుటంబున దుఃఖాగ్ని యతి తీవ్రముగ మండుచుండెను గదా.

చంద్రిక—అవును.

యశోధర—అందు సహనమను సుగంధద్రవ్యమును వేసితిని. అప్పు డందుండి భక్తియనెడి పరిమళధూపము వెడలెను. ఆ ధూపము ప్రార్థన లనుగాలితోఁ బైకిఁబోయి దేవతలను సంతృప్తి పఱచినది. అంత వారు కృపార్ద్రచిత్తులై మన్నాథుని—హా! కాదు కాదు—బుద్ధస్వామిని నిటకుఁ బంపినారు.

చంద్రిక—అట్లయిన, ఇది యంతయు నీ భాగ్యమే యగును.

యశోధర—ఎవరిభాగ్యమైన నేమి కాని, ఇప్పుడు నా మనఃపుటమున డాఁగియున్న దుఃఖాగ్నికణములు నా మోహజనితమగు నిట్టూర్పు గాడ్పుచే బయలు వెడలుచున్నవి.

చంద్రిక—వానిని శాంత రసముతోఁ జల్లార్పుము.

యశోధర—వానిని జల్లార్చుటకే యత్నించుచున్నాను. అంతేకాదు. బుద్ధాచార్యుఁడు నాకు ఋత్విజుఁ డగుచో నాచిత్తమనెడి యజ్ఞశాలయందు మోహ మనెడి యజ్ఞపశువును బలియిచ్చి, దేవతారాధన మొనర్చెదను. కాని, చంద్రికా! బుద్ధస్వామి నాకు దర్శనభాగ్య మిచ్చి నాచేయు యజ్ఞమునకు నాచార్యత్వము వహించునా?

చంద్రిక—ఏల నీకిట్టి సందేహము? సకల జీవలోక సముద్ధరణ దీక్షాపరతంత్రుఁ డగు బుద్ధాచార్యుఁడు నిన్ను మఱచునా?

యశోధర—మఱవఁడనియే నమ్మకమున్నది. ఆనాఁడు చెన్నునితోఁ 'గాలాంతరమునఁ గపిలవస్తు పురమునకు వచ్చి, యందఱకు దుఃఖనివారక మార్గ ముపదేశించెద' నని సందేశ మంపి యుండెను. చెన్నుఁ డామాట నాతోఁ జెప్పి యేడేండ్ల యినను, అతఁడు మరణించి రెండేండ్లయినను, అతని పలుకులు నామనస్సులో శబ్దించుట, నిప్పుడు పలికినట్లు తోఁచెడి.

చంద్రిక—చెన్నుఁడు మరణించిన సంగతి బుద్ధస్వామికిఁ దెలియదేమో.

యశోధర—అతని కాహ్వాన శ్రీముఖమును గొని పోయిన యుదయనుఁడు ఆ సంగతి యాతనితోఁ జెప్పలేదని నాతో నుడివెను.

చంద్రిక—అట్లయిన నింకెవ్వరీ వార్త యా మహానుభావునితోఁ జెప్పువారు? ఇఁక మీఁద నాతఁడే యడిగి తెలిసికొనును.

యశోధర—ఆహా ! చెన్నునిపై నాతని కుండినది యెంత నిరతిశయమైన ప్రేమ !

(లోపల మంగళవాద్యములు మ్రోఁగును.)

యశోధర—(ఆ దిక్కు చూచుచుఁ దహతహతో) అవే ! మంగళవాద్యములు ! ! బుద్ధస్వామి కెదురుకో లానంగు జనసమూహము ఘూర్ణిల్లుచున్నది. బుద్ధప్రభుఁడు వచ్చినట్లున్నది. ఎక్కడనే యాతఁడు ?

చంద్రిక—(పరికించి చూచి, చేతితోఁ జూపుచు) అదిగో ! అదిగో !.. మహానుభావా ! స్వాగతము, సుస్వాగతము. (మ్రొక్కును)

యశోధర—(ఆత్రముతో) ఎక్కడనే యెక్కడనే యాతఁడు ?

చంద్రిక—(చేతితోఁ జూపుచు) మీతండ్రిగారి ప్రక్కననుండు ఆ యున్నతకాయుఁడు, ఆజానుబాహుఁడు కాఁడటే బుద్ధస్వామి ?

యశోధర—(పరికించి చూచుచు) కాదు ... ఔను ... కాదు ... ఏమో ... ఆ మహానుభావుని గృహస్థాశ్రమ మప్పటి తరుణ మంగళ రమణీయాకారమే నా స్మృతిదర్పణంబున వెలయుచుండుటచేత, నా మనస్సాతని సన్న్యాసి రూపమును నింత దూరమునుండి గుర్తింపలేకున్నది.

చంద్రిక—(స్మితము సల్పుచు) ఇప్పుడీ సన్న్యాసి రూపమున నుండు బుద్ధస్వామిని జూచినచో, నీ స్మృతి దర్పణంబున వెలయుచున్న యా మహానుభావుని "గృహస్థాశ్రమ మప్పటి తరుణ మంగళ రమణీయాకారము" మాసిపోవునని

కాఁబోలు నీ మనస్సు గుర్తింపకున్నది. అట్లయిన నీవేల యా బుద్ధస్వామిని సందర్శింప రావలెను ?

యశోధర—సన్న్యాసిరూపముననున్న యా మహాను భావుని నింతదూరము నుండి గుర్తింప లేనంటిని. అంతయె. నా స్మృతి దర్పణంబునఁ దోఁచు ఆ మహానుభావుని గృహ స్థాశ్రమ మప్పటితరుణ మంగళాకృతికంటె, బుద్ధస్వామి సన్న్యాసిరూపమే యెక్కువ యానందదాయకము.

చంద్రిక—ఇదియు సరె.తన్ను నెడఁబాసిపోయిన మనో నాథుఁ డెట్లున్న నేమి, ఆతని పునర్దర్శన మానందదాయక మగుట యుత్తమాంగనకు సహజమే ... కాని, చెలీ, ఎఱుఁగఁ గోరి నిన్నొకటి యడుగుచున్నాను.

యశోధర—(జనశ్రేణి వంక నిలిపినచూపు మరల్ప కయె) అవశ్య మడుగుము.

చంద్రిక—చెన్నఁడానాఁడు నీ నాథుఁడు సన్న్యాసి యయ్యె నని వచింపఁగా నీ వెంతో పరితపించితివే. నాఁటి యాతని సన్న్యాసిరూపమా లేక నేఁటి యీతని సన్న్యాసి రూపమా నీ కెక్కువ దుఃఖజనకము ?

ఆ జనశ్రేణికి నృత్యపంక్తు లడ్డమైనవి లే; ఇప్పుడు నా దిక్కు మొగమై నా ప్రశ్న కుత్తరము చెప్పుము.

యశోధర—(చెలదిక్కు మొగంబై) నీప్రశ్న కుత్త రము నా మోముననే గాన వచ్చుచున్నది; దానిని నా నోటి నుండి కూడ వినఁగోరి నీవు నన్నిట్లడుగుచున్నావు కాఁబోలు. సరియె చెప్పెదను. ఈ నాఁడీతని సన్న్యాసిరూపమును బ్రత్య క్షముగాఁ గాంచు నప్పటికంటె, ఆ నాఁడు నా మనఃకల్పిత

మైన యాతని సన్న్యాసి రూపమును గాంచినప్పుడే నాకెక్కువ దుఃఖకరముగా నుండినది. ఏలన, అప్పుడా రూపము మనఃకల్పితమైనను, తీవ్రమగు నచ్చపు మనోవ్యథయందు నన్ను ముంచెను. ఇప్పుడీతని దర్శనమువలన నే ననుభవించు దుఃఖమన్ననో, పూర్వ మనుభవించినదాని ప్రతిబింబము మాత్రమే యగును. తీవ్రమగు నచ్చపు మనోవ్యథను ననుభవించుట యందు మాధుర్య ముండదు గదా.

చంద్రిక—ఉండ దుండదు. తీవ్రమగు యాతన యుండును.

యశోధర—ఏలనఁ గరుణము పుట్టుటకు నక్కడ నవకాశమే లేదు. కాని, ఇది మాత్రము నిజము:

తే. స్మృతిఁ బ్రతిఫలించు తొల్లిటి వెతలు, పిదపఁ
గరుణముగ మాఱి మధురమై పరఁగుచుండు;
అమృతకరుని పైఁబడ్డ తీవ్రాంశు ఘృణులు
చలువగల వెన్నెలగమాఱి చనెడి మాడ్కి.

చంద్రిక—అది యంతయుఁ గాలపురుషుని మహిమ. (లోపలఁ గరతాళధ్వనులు విని, యా దిక్కు చూచి) అదే రాజకుమారులును, రాజపుత్రికలును, బుద్ధస్వామిపై సేసలు చల్లి, సంతోషమునఁ జప్పటులు గొట్టువారు.

యశోధర—అందు రాహులుఁ డుండును గదా?

చంద్రిక—నీవే యలంకరించి పంపితివే.

యశోధర—బుద్ధప్రభుఁడు తన జనకుఁ డని పాపము వాఁ డెఱుఁగఁడు.

చంద్రిక—తోఁడి రాకుమారు లెటేఁగించి యుందురు. (మంగళ వాద్యములు వినవచ్చు దిక్కునకు దృష్టి సారించి) యశోధరా! పట మందిరముం బ్రవేశించు బుద్ధస్వామిని ఇప్పుడైన బాగుగ సందర్శించుకొనుమా.

యశోధర—(దృష్టి నిగిడించి చూచి, కన్నులఁ దడి పెట్టుచు) అహో! బుద్ధదేవా! నమస్కారము. (మ్రొక్కును.)

చంద్రిక—మీ మామగారు బంధుమిత్రామాత్యులతోఁ బటమందిరములోనికి బుద్ధస్వామి వెంటఁ బోవు చున్నారు. (యశోధర కంట నీరు పెట్టుట గనుఁగొని) యశోధరా! బుద్ధదేవుని తరువాతను నెడతెగక వచ్చుచున్న యీ శ్రమణవాహినిం గాంచుమా.

యశోధర—(కన్నులు తుడిచికొని చూపు నిగిడ్చి) ఆహా! సితపట కుటీర సముత్తుంగ తరంగ సముల్లసితమై, యుప్పొంగు జన సముద్రముం జేరు నఖండ పూజ్య శ్రమణ గంగాప్రవాహ మెంత రమణీయముగ నున్నది!

(మంగళ వాద్యములు మ్రోఁగును.)

చంద్రిక—యశోధరా! బుద్ధస్వామి వెంటఁ బట మందిరము లోనికిఁ బోయినవా రందఱు వెలుపలికి వచ్చు చున్నారు.

యశోధర—అదే యందఱు గుంపుగూడి నగరుదిక్కుగా మరలుచున్నారు.

చంద్రిక—ఇంక మనము మేడ దిగుదము.

(దిగి పోవుదురు.)

---

రంగము 2. కపిలవస్తుపురవీధి.

(బుద్ధుఁడు భిక్షాపాత్రతో భిక్షాటనము చేయుచుండును.)

బుద్ధుఁడు— (ఒకయింటి గుమ్మము ముంగల నిలిచి) భవతి భిక్షాం దేహి. (ఒక యిల్లాలు లోపలనుండి వచ్చి, బుద్ధునికి బిచ్చము వెట్టును.)

(దేవదత్తుఁ డించుక దూరమునఁ బ్రవేశించును.)

బుద్ధుఁడు—(మఱియొక గుమ్మములోనికిఁ బోయి) భవతి భిక్షాం దేహి.

దేవదత్తుఁడు—(బిచ్చమెత్తు బుద్ధునిఁ జూచి) తన రాజధానియందలి వీధివీధులనే భిక్షాటనముచేయు నీ రాజపుత్రునిఁ జూడ, నా కన్నులు నేఁటి కింత సఫలత గాంచినవి. రాజ్యమునుండి నన్ను బహిష్కృతుని గావించిన యీ శుద్ధోదన రాజజంబుకము, బుద్ధుఁడు బిచ్చమెత్తఁగాఁ జూడవలెనని నా మనస్సు కుతూహలపడుచున్నది. తన కుమారుఁడు రాజవీధుల బిచ్చమెత్తువాఁ డనువార్త యీ వృద్ధజంబుకమున కింకను జేరకుండునా ?... అహో ! వృద్ధజంబుక మదే వచ్చుచున్నది. నే నిందే యొదిగియుండి చూచెదను. (అట్లుచేయును. శుద్ధోదనుఁడు ప్రవేశించును.)

బుద్ధుఁడు— (గుమ్మములోనుండి వచ్చి, మఱియొక యింటి గుమ్మముకడకుఁ బోయి) భవతి భిక్షాం దేహి.

శుద్ధోదనుఁడు—(బుద్ధుని జూచి) అకటకటా ! నా కన్నకొడుకు భిక్షమెత్తుట యీ పాడు కన్నులతోఁ జూడవలసి వచ్చెఁగదా ! హా ! దైవమా !

సీ. ఇనుక చల్లినరాలని సరవిమై రాచ
తెరువుల జనులు క్రిక్కిఱిసి యుండియు,
సౌధాధిరూఢ యోషాకటాక్ష విలాస
పంక్తులు తోరణ ప్రభలనింప,
ప్రాంచదలంకృత భద్రగజముపైని
యంబారియందుఁ దా నధివసింప,
యువరాజు వచ్చునం చుప్పొంగి జనములు
జయశబ్దగరిమఁ బుష్పములు రువ్వ,
గీ. ప్రాభవంబున నటు మెరవడిని వెడలు
పుత్రుఁ డిపుడిట్లు బిచ్చపుఁ బాత్ర మూని
వాడవాడలఁ దిరియంగఁ జూడవలసె;
ఉర్వి నను బోలు నిర్భాగ్యు లున్నవారె?

(ఇల్లాలు బిచ్చము పెట్టఁగా వీధిలోనికి వచ్చు బుద్ధుని సమీపించి) హా! కుమారా! నీ జన్మము కట్టకడ కిందునకై నదా? నేనెట్లు కనులారఁ జూచి భరింతును?... నీకును, నీ భిక్షుక సంఘమునకును, ఆహారసంభారములం దేమి కొదువ యైనది? నీ విట్లు నా కనులముందఱ బిచ్చమెత్తి, న న్నేల యవమానించెదవు?

బుద్ధుఁడు—భిక్షమెత్తుట నా వంశాచారము.

శుద్ధోదనుఁడు— ఏమేమి? ఇది నీ వంశాచారమా? నీవు మహాశమంతుని వంశమున జన్మించితివి. నీ వంశమువా రెవ్వరు మును పిట్లు చేయలేదు.

బుద్ధుఁడు— అయ్యా! నే నా మహాశమంతుని మాట చెప్పుటలేదు. నా వంశమగు బుద్ధుల వంశాచారము మాట

చెప్పితిని. బుద్ధు లందఱు బిచ్చమెత్తి జీవించినవారె. కావున, నాకు బిచ్చమెత్తుట విధి ... ... అయ్యా ! మీరు నగరునకుఁ బొండు. నే నింతలో మిమ్ములఁ గలసికొనియెద.

శుద్ధోదనుఁడు—అయ్యో ! ఏమి చేయనగు ! (తలవంచికొని దుఃఖముతోఁ బోవును.)

బుద్ధుఁడు—(మఱియొక యింటికడకుఁ బోయి) భవతి భిక్షాం దేహి.

దేవదత్తుఁడు—(ముందఱకు వచ్చి) ఈ వృద్ధజంబుకమునకు మొగమున మసిపూసి నట్లాయె. నాకుఁ గడుపునిండె. ఇంక నీ బుద్ధునికి బిచ్చము పెట్టక, వీని నవమానించువా రెవ్వరేని యుండకుందురా ?

బుద్ధుఁడు—(ఇల్లాలు బిచ్చము పెట్టఁగా వేఱొక యింటికిఁ బోవుచుండును.)

దేవదత్తుఁడు—ఆదే వీఁడు భరద్వాజుని గృహమునకుఁ బోవువాఁడు. భరద్వాజుఁడు గడుసువాఁడు. తన యల్లుఁడు బుద్ధమతములోఁ గలుపుకోఁబడినాఁ డని, వీనికి బుద్ధుఁ డన్నను బుద్ధ భిక్షువు లన్నను మిక్కిలి యసహ్యము. వీఁడే బుద్ధుని నవమానింపఁ జాలినవాఁడు.

బుద్ధుఁడు—(ఇంటి గుమ్మముకడ నిలిచి) భవాన్ భిక్షాం దదాతు.

భరద్వాజుఁడు—(గట్టిగ నఱచుచుఁ బ్రవేశించి) ఈ బుద్ధ భిక్షువులను జూచిన, నాకు సిలువెల్ల మండును. ఈ భిక్షువుల రాయిడి దేశమంతటను బ్రబలినది. వీరు ముండ మోయించుకొని దేశమంతటిని ముండమోయించుచున్నారు.

దేవదత్తుఁడు—(ముందఱకు వచ్చి) ఒహో ! నే నను కొన్నట్లే సంభవించుచున్నది.

భరద్వాజుఁడు—ఓ భిక్షుకా ! నేను కష్టపడి దున్ని, విత్తనములు చల్లి, సేద్యముచేసి, ధాన్యము పండింతును. నీవును నా వలెనే యేల సేద్యము చేయఁగూడదు ? అప్పుడు నీ జీవనమునకై యొకరిమీఁద నాధారపడవలసి యుండదు గదా.

దేవదత్తుఁడు—ఒప్పుకొంటిని. మంచి ప్రశ్న వేసెను. వీఁడేమి బదులు చెప్పునో. (ఒదిగి యుండును.)

బుద్ధుఁడు—గృహస్థుఁడా ! కర్షకుఁడా ! నేనును నొక్క విధముగ దున్ని విత్తనములు చల్లి కృషి చేయువాఁడనే.

భరద్వాజుఁడు—నీవు కృషీవలుఁడ వెట్లు ?

బుద్ధుఁడు—

సీ. నాదు దేహము పెద్ద నాఁగేలు, జ్ఞానంబు
వినయంబు దానికి మొనలె యగును;
ధర్మంబు పిడియౌను దానికి, శ్రద్ధయే
మడకకుఁ బూన్చిన మంచి యెద్దు;
ధైర్యంబె, యాత్మంబు దనకేల దృఢముగాఁ
బట్టిన కోరంపుఁ బ్రగ్రహంబు;
జనమనంబులె క్షేత్రచయము; సత్కార్య సం
దోహమే పెనుపైన దోహదంబు;

తే. తనరఁ గృషిసల్పి సద్భక్తి యనెడి విత్త
నముల నాఁటి, సత్యమత సస్యమును పెంచి,
మాయనాఁబడు కలుపును దీయఁగాంచి
నింతు నిర్వాణ ఫలము పండించువాఁడ.

భరద్వాజుఁడు—దేవా! నీవు బుద్ధ భగవానుఁడవే యగుదువు. (దండవత్ ప్రణామము లాచరించి లేచి) ఆచార్య శేఖరా! నేను భరద్వాజుఁడను విప్రుఁడను. భవదీయ వాక్కులచే మన్మనఃక్షేత్రము దున్నఁబడినది. అందు బుద్ధమత బీజములు నాఁటి, నన్ను నిర్వాణ ఫలము భుజింపఁ జేయుమా. స్వాములకు నన్ను నేనె భిక్షగా నిచ్చుకొనుచున్నాను.

బుద్ధుఁడు—అట్లయిన భరద్వాజా! నా వెంటరమ్ము. (బుద్ధుఁడు వేఱొక గుమ్మములోనికిఁ బోవ, భరద్వాజుఁడు వెలుపల నుండును.)

దేవదత్తుఁడు—(ముందఱకు వచ్చి) ఇది యెట్లు పరిణమించినది! వీనితో నేఁడు మాటలాడువా రందఱు వీనినే యనుసరించి, బుద్ధమతావలంబకు లగుచున్నారు! ఏమి యాశ్చర్యము! వీనిని జంపఁ బోయిన యంగులీమాలుఁడును, ఇల్వలుఁడును, వీనిని జంపక పోవుటయే గాక, మీఁదు మిక్కిలి, బుద్ధసన్న్యాసు లయిరి. ఇది యంతయుఁ జూచి, నే నెట్లోర్వఁగలను? వీని దుష్టమత వ్యాప్తి కే నెట్లు సైరణ సేయుదును? నేనును ఈ బుద్ధమతములోఁ జేరి గొడ్డలిలోని కఱ్ఱనైయుండి, యీ బుద్ధమతారణ్యమును మొదలంట ఛేదించెదఁ గాక. ... అదే వీఁడీదెన వచ్చుచున్నాఁడు; వీనిని సమీపించెదను.

(వచ్చుచున్న బుద్ధుని సమీపించి, సాష్టాంగ ప్రణామము చేయును.) దేవా! అనుగ్రహింపుము; అనుగ్రహింపుము.

మొగ్గలానుఁడు— (భిక్షాపాత్రతోఁ దూరమున బ్రవేశించి, యాశ్చర్యముతో) ఏమిది ! బుద్ధవిరోధియు, బుద్ధమత బద్ధద్వేషియు, నగు దేవదత్తుఁడు !

దేవదత్తుఁడు—(లేచి) నన్ను గుర్తింపఁ గల్గితిరా?

బుద్ధుఁడు— (స్మితముతో) గుర్తింపకేమి? నీవు దేవదత్తుఁడవు.

దేవదత్తుఁడు—నన్ను బుద్ధ సన్న్యాసిగాఁ జేసి, కృతార్థునిఁ జేయుఁడు.

మొగ్గలానుఁడు—(సమీపించి) ఏమి వింత యిది!!

బుద్ధుఁడు—మొగ్గలానా ! నీ భిక్షాపాత్ర నిటు దెమ్ము. (గైకొని) వీ రిరువురకు నుపసంపద యిమ్ము. సోదరులారా! మీ రీతని వెంటఁబొండు. ఉపసంపద నిచ్చును; గైకొనుఁడు.

దేవదత్తుఁడు, భరద్వాజుఁడు—అనుగ్రహింపబడితిమి. (మొగ్గలానుఁడు, దేవదత్తుఁడు, భరద్వాజుఁడు నొకదిక్కు పోవ, బుద్ధుఁడు వేఱొక దిక్కు పోవును.)

---

రంగము 3. కపిలవస్తుపురము. రాచనగరు.

(బుద్ధుఁడు, శారిపుత్త్రుఁడు, శుద్ధోదనుఁడు, మంత్రి, గౌతమి, చంద్రిక, సముచితరీతిఁ గూర్చుండి యుందురు.)

శుద్ధోదనుఁడు— నా సోదర పుత్త్రుఁడగు దేవదత్తుఁడే?

బుద్ధుఁడు—అవును. ఆతఁడే యుపసంపద గైకొనువాఁడు.

శుద్ధోదనుఁడు—వాని నేను రాజ్య నిర్వాసితునిఁ జేసియుంటిని. వాఁ డెట్లీ పురమునఁ గాలిడఁ గలిగెను ?

బుద్ధుఁడు—అతఁ డెన్ని యపరాధములు చేసియుండనీ, బౌద్ధసన్న్యాసి యగుటంజేసి క్షమార్హుఁడు. మొగ్గలానుఁడే యతనికి సన్న్యాసి దీక్ష నొసంగఁ బోయినవాఁడు.

శుద్ధోదనుఁడు—దేవదత్తుని బుద్ధ శ్రమణునిగాఁ జేర్చుకొనుటవలన, బుద్ధ సంఘమునకే యపాయము గలుగునేమొ.

బుద్ధుఁడు—బుద్ధుని, బుద్ధమతమును, బుద్ధసంఘమునును, శరణము నాశ్రయించినవానివలన నెట్టి తొందరలు నెన్నఁటికి నుండవు. ... చెన్నుఁ డెక్కడ?

మంత్రి—స్వామీ! అతఁడు మరణించి రెం డేండ్లాయెను. అతఁడు మరణించిన మఱుదినమే కంటకాశ్వముగూడ మరణించెను.

బుద్ధుఁడు—శాంతి! శాంతి! శాంతి! అతఁడు తృష్ణను జయింపఁ జాలియుండెను. ముందటి జన్మమున నతఁడు బోధిసత్వపదముం బొందఁగలఁడు. కంటకాశ్వముది పుణ్యజన్మము. శాంతి! శాంతి! ... ... వెలుపట నాడుచుండఁగా రాహులుని జూచితిని. (గౌతమిం జూచి) అమ్మా! నం దుడెక్కడ?

గౌతమి—వాఁడెటకో పోయియున్నాఁడు; ఇంతలో వచ్చును.

బుద్ధుఁడు—యశోధర యెక్కడ?

గౌతమి—ఇక్కడనే ప్రక్కగదిలో నున్నది. చంద్రికా! తోడ్కొని రావే. (చంద్రిక లోనికిఁ బోయి యశోధరతో వచ్చును.)

యశోధర—(చెఱఁగుతోఁ గన్నులు పులుముకొనుచు) హా! నాథా ! నాథా ! (బుద్ధుని పాదములఁ బట్టుకొని శోకించును. అందఱు నాశ్చర్యముతోఁ జూచుచుందురు.)

బుద్ధుఁడు— ఈ రాజపుత్రి యేడేండ్లుగా నన్నుఁ జూడకుండుటచే నీమె హృదయ తటాకము శోకరసముతో నిబిడీకృతమై యున్నది. ఈ శోకరసము పొరలిపోయినం గాని, యీమెహృదయ తటాకము నిలువదు.

శారిపుత్త్రుఁడు—ఈమె స్త్రీజన స్వభావ సహజమైన దుఃఖమునకు లోనయినది.

గౌతమి—తల్లీ ! యశోధరా ! ఈతఁ డిప్పుఁడు నీ నాథుఁడు గాక జగన్నాథుఁడు గదమ్మా.

శుద్ధోదనుఁడు—తల్లీ ! తథాగతుని పాదము లంటఁ గూడదు. లెమ్మా.

యశోధర—(మెల్లగఁ బాదములు విడిచి నిలిచి తనలో) హా ! ఈతని కే నెంత దగ్గఱనున్నను, ఎంత దూరమున నున్నదానను ! (చంద్రిక యశోధరను దోడ్కొనివచ్చి గౌతమికడ విడుచును. యశోధర సిగ్గునను శోకముననుదలవంచి నిలుచుండును.)

శుద్ధోదనుఁడు—పాప మీామెదుఃఖము ప్రేమాతిశయమువలనఁ గలిగినది. నీవు సన్న్యాసి వైతివని విన్నతోడనే యీామె మనస్సన్న్యాసమును బూని, యాభరణంబులఁ దిగఁద్రావి, దుకూలంబులఁ బరిత్యజించి, నారచీరలు గట్టి, మితాహారిణియై, బుద్ధ పదధ్యానముతోఁ గాలము గడుపుచున్నది.

బుద్ధుఁడు—యశోధర తన యశ్రుముక్తామణులచే నా కభిషేకము గావించినది. ఈమె కడుఁ బుణ్యురాలు. ఈమె నా పూర్వ జన్మమున నాకు భార్యయై యుండెను. ఈమెచిత్త శుద్ధి, ఈమె వినయము, ఈమె శ్రద్ధాభక్తులు, నేను బోధి సత్వుఁడనై యున్నతఱి, నాకు మిక్కిలి సహాయభూతములై యుండెను. ఈమె గుణము లన్నియు నీమె పూర్వజన్మ సుకృత ఫలములు. ఈమె శోకి మిప్పు డగాధమై చూపట్టినను, ఆ శోక మునె యానందముగా మార్చుకొనఁజాలిన మహత్తరమైన సామర్థ్య మీమె కున్నది.

శారిపుత్రుఁడు—(యశోధరను జూచి) అమ్మా ! నీవు కడు ధన్యురాలవు.

యశోధర—(తనలో) బుద్ధప్రభుని మనస్సునకు నేనింత యెక్కిన దాననా ! నా పూర్వజన్మ వృత్తాంత మీ మహాను భావుని నోటినుండియే నే వినఁ గాంచితిని. నా జన్మము సార్థక మయ్యె.

గౌతమి—బిడ్డా ! కూర్చుండుము. (యశోధరయు, జిత్రయుఁ గూర్చుండుదురు. బుద్ధుని జూచి) నాయనా ! నీ వా నాఁడు గృహపరిత్యాగము చేసి పోయితివే, ఆనాఁడు మొదలు మాకు దుఃఖములు పీడకున్నది.

బుద్ధుఁడు—(స్మితముతో)మీ దుఃఖములఁ బోఁగొట్టు టకే నే నిక్కడకు వచ్చుట.

గౌతమి—నీ విక్కడనే నిలిచిన మా దుఃఖము లుపశ మిల్లును.

బుద్ధుఁడు—నేను లోక దుఃఖమును మాన్పవలసి యున్నది. నే నిందే యుందు నేని, యది యెట్లు పొసఁగును? మీ దుఃఖముల మాన్పి కాని నేను ముందు బోవనులే.

శుద్ధోదనుఁడు, గౌతమి—సంతోషము, సంతోషము.

బుద్ధుఁడు—మీ దుఃఖ కారణమేమి ?

గౌతమి—నీ వలని వియోగము.

బుద్ధుఁడు—నా వలని వియోగముచేత మీకు దుఃఖమేల ?

శుద్ధోదనుఁడు—నీవు మావాఁడ వగుట.

బుద్ధుఁడు—నేను నా తల్లిదండ్రుల పొత్తులవాఁడను గదా!

మంత్రి—అవును.

బుద్ధుఁడు—నా తల్లిదండ్రులు నట్లే మఱి నలుగురికిఁ బొత్తులవారు గదా ?

మంత్రి—అవును.

బుద్ధుఁడు—ఆ నలువురు మఱి యెనమండ్రకుఁ బొత్తుల వారు గదా!

మంత్రి—అవును.

బుద్ధుఁడు—ఇట్లే పైకిఁ బోగా, ఇంతకు బూర్వము పుట్టినవా రందఱితో నాకు సంబంధ మున్నదని తేలుచున్నది గదా ?

మంత్రి—అవును.

బుద్ధుఁడు—ఇప్పుడు ప్రపంచమున నుండునట్టియు, ముందుఁ బుట్టఁగలట్టియు జనులందఱుఁ బూర్వజనుల సంతానమే కదా?

మంత్రి—నిస్సందేహమున.

బుద్ధుఁడు—ఇదివఱలోఁ బుట్టినవారితో నాకు సంబంధమున్నదని యిప్పుడె యొప్పుకొంటిరి ?

శుద్ధోదనుఁడు—అవును; ఒప్పుకొంటిమి.

బుద్ధుఁడు—అట్లగుటచేత, ఇప్పుడు ప్రపంచముననుండునట్టియు, ముందుఁ బుట్టఁగలట్టియు వారితోఁగూడ నాకు సంబంధ మున్నది గదా?

శుద్ధోదనుఁడు—ఉన్న దని యంగీకరింతుము.

బుద్ధుఁడు— అట్టివేళ, నేను మీ వాఁడను మాత్ర మెట్లగుదును ?

గౌతమి—నీ వందఱివాఁడవు, నీ వందఱివాఁడవు.

బుద్ధుఁడు— నే నందఱివాఁడ నగుటచేత, నిరంతర మిందే యుండనగునా? లక్షోప లక్షలుగ నుండు, నా యాత్మీయులతోడ నేను గొంతకుఁ గొంతయైన నుండవలయునుగదా?

గౌతమి—ఉండవలయును.

బుద్ధుఁడు—కావున, నే నిక్కడనే నిరంతర ముండవలయు ననుకోరిక సమంజసమైనదా ?

గౌతమి—కాదు, కాదు. అజ్ఞానముచే నట్టి కోరిక కోరితిమి.

బుద్ధుఁడు—నే నందఱివాఁడ నగుటచేతను, అందఱు నా వా రగుటచేతను, బ్రపంచమున నింకఁ బెరవారెవరు ?

గౌతమి, శుద్ధోదనుఁడు—ఎవ్వరును లేరు.

బుద్ధుఁడు—సరి. ఏకాణుజీవినుండియె ప్రపంచము నందలి జీవరాసు లన్నియు నుత్పన్నము లైనవని పూర్వార్షా తులు చెప్పుదురు. శారిపుత్రా ! ఈ సంగతి నీకుఁ దెలియుఁ గదా ?

శారిపుత్రుఁడు— ఏకాణుజీవియె నిఖిల జీవరాసుల యుత్పత్తికిఁ బ్రాతిపదిక.

బుద్ధుఁడు—అట్లగుట మన యొక్కొక్కరి దేహము సకల జీవరాసు లది యగును గదా!

శుద్ధోదనుఁడు—అవును.

గౌతమి— తెలిసినది, తెలిసినది, ప్రపంచమే యొక యిల్లని.

బుద్ధుఁడు—సరె. అజ్ఞాన జన్యమైన మీ కోరికవలన-మీ తృష్ణవలన మీకుఁ గలుగున దేమి ?

గౌతమి, శుద్ధోదనుఁడు— దుఃఖము - బాధ.

బుద్ధుఁడు—ఇట్టి దుఃఖ కారణమైన తృష్ణను నశింపఁ జేయవలసిన దే కదా ?

శుద్ధోదనుఁడు—తప్పక నశింపఁ జేయవలసిన దే.

గౌతమి—అట్టి దుఃఖము నశించు మార్గ మేది? అది మాకు బోధింపుము.

యశోధర—(తనలో) అదియె ముఖ్యముగఁ గా వలసినది.

బుద్ధుఁడు—అదె చెప్పెదను. ... చచ్చినవాఁడు తన వెంట ధనముఁ దీసికొని వెళ్లునా ?

గౌతమి—ధన మెట్లు దీసికొని పోవును ?

బుద్ధుఁడు—వాని వెంట వచ్చున దేమని మీ రెఱుం గుదురు ?

గౌతమి—పుణ్యము, పాపము, అని.

బుద్ధుఁడు—ఈ పుణ్యపాపములు వాని కెట్లు గలిగినవి?

శుద్ధోదనుఁడు—మనోవాక్కాయముల వాఁడు చేయు కర్మములఁ బట్టి.

బుద్ధుఁడు—కావున, మనుష్యుఁడు తనదని యదార్థ ముగఁ జెప్పఁకోఁ దగిన దేది?

గౌతమి—తన కర్మము.

శుద్ధోదనుఁడు—లేక, తన కర్మఫలములగు పుణ్యపాప ములు.

బుద్ధుఁడు—సరె. తన కర్మనుబట్టి యుత్తర జన్మము గలుగును గాన, మనుష్యుఁడు దానీప్రపంచమున నేమి చేయ వలయును ?

శుద్ధోదనుఁడు—సత్కర్మ చేయవలయును.

బుద్ధుఁడు—సరె. తను విక్కడ నశించునుగాన, ఉత్తర జన్మము దేనికిఁ గలుగునని మీ భావన ?

శుద్ధోదనుఁడు—ఆత్మకు.

బుద్ధుఁడు—ఆత్మ యెట్టిదని మీ భావము ?

శుద్ధోదనుఁడు—చైతన్యము గలదని, శాశ్వతమైనదని.

బుద్ధుఁడు— 'నేను' 'నేను' అనునది యదియెగదా ?

శుద్ధోదనుఁడు—అవును.

బుద్ధుఁడు— 'నేను' చైతన్యము గలదిగను, శాశ్వతమైనదిగను నుండుపక్షమున, దానిపట్ల మమత్వ ముండుటమానవునకు సహజము గదా ?

శుద్ధోదనుఁడు—సహజమె.

బుద్ధుఁడు—మమత్వమువలన స్వసుఖ తత్పరత, దీనివలనఁ బరసుఖ విముఖత - పరద్వేషము పుట్టునుగదా ?

శుద్ధోదనుఁడు—పుట్టును.

బుద్ధుఁడు—స్వసుఖాసక్తియు, పరద్వేషము, గలవానికి సుఖ ముండునా ?

గౌతమి— వానికి సుఖ మెప్పటికి నుండదు.

శుద్ధోదనుఁడు—దుఃఖముండును.

బుద్ధుఁడు—'నేను' అను నాత్మను జైతన్యము గలదిగను, శాశ్వతమైనదిగను దలఁచుటచేతనే గదా దుఃఖము గలుగుట ?

గౌతమి—అవును.

శుద్ధోదనుఁడు—కాని, యాత్మ యిం కెట్టిదగును ?

బుద్ధుఁడు—కరచరణాద్యవయవసంఘటితము దేహము. నేత్రాది పంచేంద్రియములును, మనస్సును, గలిసి దేహమునకంటె భిన్నమైన యాత్మయైనది. 'నేను', 'నేను' అనున దీ యాత్మయె.

శుద్ధోదనుఁడు— మరణానంతరమున దేహమును, ఇంద్రియములును, మనస్సును, నుండవు గావున, నీవు చెప్పినట్టి యాత్మ యచేతనమైన యశాశ్వత స్వరూప మగును గదా!

బుద్ధుఁడు—నిజముగ ఆత్మ చైతన్యరహితమగు నశాశ్వత వస్తువేయగును. ఈ యాత్మయే యహంతత్త్వము.

శుద్ధోదనుఁడు—ఆత్మ యచేతనమును నశ్వరమును నగు వస్తువైనఁ, బునర్జన్మ మెట్లు గలుగును ?

మంత్రి—తమరు పునర్జన్మమున్నదని యిప్పుడే సెలవిచ్చితిరి గదా.

గౌతమి—మంచి ప్రశ్నము.

యశోధర—(తనలో) వీరి సంభాషణ మెంతయు త్తేజకరముగా నున్నది !

బుద్ధుఁడు—పునర్జన్మ మున్నది. ప్రాణములు దేహమును దొఱఁగు సమయమునఁ బ్రతి జీవునకును దన పూర్వకర్మను సారముగ నేదో యొకదాని మీఁద మనసుపోయి తీరును. ఈ కడపటి మనః కర్మమె ముందు జన్మమునకుఁ బ్రాతిపదికమై యుండును.

శుద్ధోధనుఁడు—పునర్జన్మ లేకుండుఁట కేమి చేయవలెను ?

బుద్ధుఁడు—విత్తనపుఁ బప్పుల నడుమ నుండు చిన్న యంకురము వలె దేహమందు 'నేను, నేను' అనెడి యహంతత్త్వ ముండును. ఈ యహంతత్త్వమే మొలకెత్తి పెరుగునది. దీని నశింపఁ జేసినఁ బునర్జన్మ ముండదు.

శుద్ధోదనుఁడు—దాని నశింపఁజేయు సాధన మేది ?

మంత్రి—అది యను గ్రహింతురు గాక.

గౌతమి—దానినే మాకు బోధింపుము.

యశోధర—(తనలో) మనసా! మెలఁకువ గలిగి వినుమా.

బుద్ధుఁడు—ఆ సాధనమే యష్టాంగ శీలము. సదభిప్రాయము, సదాలోచనము, సత్సంభాషణము, సత్కర్మము, సజ్జీవనము, సత్ ప్రయత్నము, సన్మనస్కత, సన్మననము, అని యెనిమిది. వీనిలో నాల్గవది యగు సత్కర్మమును గూర్చి చెప్పెదను.

మంత్రి—అవధానముతో విను చున్నాము.

బుద్ధుఁడు—ప్రపంచ మంతయు నొక్క యిల్లనియు, దాని యందలి జనులందఱు సోదరు లనియుఁ దెలిసి కొంటిరి గదా?

మంత్రి—తెలిసి కొంటిమి.

బుద్ధుఁడు—సోదరుల కేమి చేయవలెను?

మంత్రి—మేలు చేయ వలెను.

బుద్ధుఁడు—మే లనఁగా నుపకార కర్మము గదా?

మంత్రి—అవును.

బుద్ధుఁడు—కర్మములను నాలుగు తరగతులుగా విభజింప వచ్చును:— తన సుఖమును బరిత్యజించి పరుల సుఖాభివృద్ధికై చేయఁబడు కర్మములు, తన సుఖమునకు భంగము గాకుండఁ బరులకు సుఖము గలిగించు కర్మములు, తన

సుఖము నిమిత్తమై పరుల సుఖమున కడ్డు దగులు కర్మములు, తనకు నష్టము గలుగ కున్నను నిర్నిమిత్తముగఁ బరులకు బాధ గలిగించు కర్మములు, అని.

మంత్రి—చిత్తము.

బుద్ధుఁడు—వీనిలోఁ గడపటివి రెండును బరపీడాకర కర్మములు; పాప దాయకములు. మొదటివి రెండును బరోప కారక కర్మములు; పుణ్య ప్రదములు. అందు మొదటి రకపు కర్మలను ఫలాపేక్ష లేక యాచరించుట చేత, అహంభావము క్రమ క్రమముగా క్షయము నందును. అది పూర్ణముగా నశించిన తోడనే పునర్జన్మ రాహిత్యము కలుగును.

శుద్ధోదనుఁడు— పరోపకార కర్మలు 'చేయవలెను జేయవలెను' అను వాంఛ దుఃఖ ప్రదము గాదా ? ఆత్మ దుఃఖమును నశింపఁ జేయఁ బోయి, మఱి యొక దుఃఖముఁ దెచ్చిపెట్టుకో నేల ?

బుద్ధుఁడు—స్వపరబుద్ధి గలవానికి, 'ఇది నా దుఃఖము ఇది నీ సుఖము' అని తోఁచును గాని, లోక మంతయు దన యిల్లనియు, లోకమే తా ననియు, తానే లోక మనియుఁ దలఁచు స్వార్పణ పరునకు, 'నీ' 'నా' యను భావము లేని మహా త్యాగికి, నిష్కామ కర్మునకు, అహంబుద్ధి లేని పూర్ణ శుద్ధునకు, దుఃఖమే యుండదు.

మంత్రి—అట్టివాని కింక సుఖప్రాప్తి యెక్కడిది ?

బుద్ధుఁడు—నిజముగ సుఖమును లేదు. దుఃఖ రాహిత్యమే సుఖమన్న ననుకొన వచ్చును. ఈ దుఃఖ రాహిత్యమే నిర్వాణము.

యశోధర—(తనలో) ఓ దుఃఖమా! నన్నింక విడిచి పొమ్ము. త్యాగమా! నా కాశ్రయ మిమ్ము.

గౌతమి—పుణ్యకర్మలు చేయుచుఁ జిత్తమును శుద్ధ పఱచెదము.

శుద్ధోదనుఁడు—నీ బోధించిన ధర్మమునే యను సరించెదము.

మంత్రి—మేము సంసారులుగ నుండియె బుద్ధమతావలంబకుల మయ్యెదము.

బుద్ధుఁడు—అట్లే కా నగును.

(ప్రవేశము—మొగ్గలానుఁడు, దేవదత్తుఁడు.)

దేవదత్తుఁడు—(తనలో) బుద్ధ శ్రమణుఁడ నగుట వలన నా తొల్లిటి చెడుతలఁపు లన్నియుఁ దొలఁగి, నా చిత్త మెంత శాంత యుత మైనది! (బుద్ధుని జూచి) అహో! బుద్ధదేవా! మీ యనుగ్రహమున నేఁ జరితార్థుఁడను.

(నమస్కరించును.)

బుద్ధుఁడు—శాంతి! శాంతి!

శుద్ధోదనుఁడు—(మంత్రితో) వీఁడు నిజముగ మాఱి యుండునా?

మంత్రి—మాఱి నట్లే యున్నది.

దేవదత్తుఁడు—(శుద్ధోదనుని జూచి) రాజేంద్రా! పూర్వము నేఁ జేసిన యపరాధములకుఁ బశ్చాత్తాపము నొందు వాఁడను. క్షమింప వేఁడు వాఁడను.

శుద్ధోదనుఁడు—పశ్చాత్తాపముచేఁ బరిశుద్ధుఁడైన బుద్ధ శ్రమణుని నేను క్షమించు టేమి?

దేవదత్తుఁడు—ఇంక నాకు బుద్ధుఁడే శరణము, బుద్ధ ధర్మమే శరణము, బుద్ధ సంఘమే శరణము.

బుద్ధుఁడు—శాంతి! శాంతి! శాంతి!

ప్రతీహారుఁడు—(ప్రవేశించి) మహా ప్రభూ! రాజ గృహము నుండి యజాతశత్రు మహారాజు గారు పంపఁగా వచ్చిన యొక భటుఁడు స్వాముల వారి కందఁ జేయుమని యీ జాబు నిచ్చెను.

బుద్ధుఁడు—శారిపుత్రా! దానిం గైకొని చదువుము.

శారిపుత్రుఁడు—(కైకొని చదువును:)

స్వస్తి. సకలలోక నిఖల దుఃఖ శమనైక దీక్షా పర తంత్రులును, రాజన్యానేక కిరీట స్థగిత దివ్యమణి గణ ప్రభా పిశంగీకృత పూజ్య పాదులును, నైన బుద్ధ భగవాను లకుఁ దమ చరణ సేవకుఁడు సాష్టాంగ నమస్కార పూర్వ కంబుగాఁ గావించు కొను విజ్ఞాపన మేమన:—

దేవా! అనిర్వచనీయము లగు మహా పాతకములఁ జేసినవాఁడ నగుటచే, నా చిత్తము మిక్కిలి పశ్చాత్తాప సంతప్త మగుచు, ఎందును నిష్కృతిఁ గానక, శాంత యుత బుద్ధమత శరణముం బొందవలయు నని, తత్తర పడుచున్నది.

స్వాముల వారు రాజ గృహమున కెప్పుడు విజయం చేసి, నాకు బోధామృతము పోసి, నన్ను శాంత చిత్తునిగఁ జేసి, యనుగ్రహింతురో యని యెదురుచూచు చున్నవాఁడను.

చిత్తగింపవేఁడు భవచ్చరణసేవకుఁడు, అజాతశత్రుఁడు.

దేవదత్తుఁడు—ఏమి యీ శుభ పరిణామ పరంపరా భ్యుదయము !

బుద్ధుఁడు— (శుద్ధోదనుని జూచి) మేమువచ్చినాలుగు దినము లాయెను. నేఁటికి మూఁడవ దినమున నే రాజగృహము నకుఁ బ్రయాణము కావలయును.

శుద్ధోదనుఁడు—అట్లే కావచ్చును. అమాత్యశేఖరా ! ఇప్పటినుండియె ప్రయాణమునకు సన్నాహముచేయుము.

మంత్రి—చిత్తము.

గౌతమి—నాయనా! మరలనీవిక్కడి కెప్పుడువత్తువో.

బుద్ధుఁడు—అవసరమున్నఁ దప్పక వచ్చెదను. అమ్మా, సెలవిమ్ము. (తల్లికి నమస్కరించును.)

గౌతమి—నీ మూలమున లోకదుఃఖములు శమించుగాక! (ఆశీర్వదించును.)

బుద్ధుఁడు—యశోధరా ! (యశోధర భక్తితో మోఁకరించును.) అజ్ఞానమును వశింపఁజేసి, అహంబుద్ధిని క్షయము గావించి, దుఃఖనివృత్తిఁ బొందుము. (మంత్రిమున్నగు వారి నందఱంజూచి) అష్టాంగ శీలము నాచరించినఁ దనకుఁ దానె యంతయు సిద్ధించును ... నే నెందున్నను నా మనస్సిక్కడఁ గూడ నుండును.

మంత్రి—అష్టాంగ శీలమును దప్పక యాచరింతుము.

శుద్ధోదనుఁడు—లోకోపకార కార్యములనే చేయుచుందుము.

యశోధర—(తనలో) అజ్ఞానమా ! నన్ను విడిచి దూరము చనుము.

శారిపుత్రుఁడు—న్యగ్రోధవనము నకుఁ బోవు వేళ యైనది. అందు స్వాముల వారి యుపన్యాసము వినుటకై మహాజను లనేకులు వేచి యుందురు.

శుద్ధోదనుఁడు—నేఁ డక్కడ సమావేశ మగు జన సంఖ్య గణనా తీతమని తెలియుచున్నది.

బుద్ధుఁడు—అక్కడికే బయలు దేరుదము.

శుద్ధోదనుఁడు—నాయనా ! నీ రాక వలనఁ గృతార్థుల మయితిమి; మా కింకఁ గోరికలు లేవు. అయినను ఈ కోరికలు సిద్ధించుఁ గాక.

(భరత వాక్యము.)

సీ. కలిగెడుఁగాక రాజులకుఁ బ్రజారక్తి
సత్పరిపాలన సలుపు కోర్కి,
పొదలుఁ గాక భరత పుత్రుల కైకమ
త్యము స్వదేశాభ్యుదయైక పరత,
వ్యాప్త మౌఁగాక ప్రపంచంబె యొక యిల్లు
జనులెల్ల సోదరు లనెడి బుద్ధి,
జనియించుఁ గావుత జనుల కొండొరులకు
మేలు సల్పెదు నట్టి మేటి కాంక్ష,

గీ. ఎఱుఁగుదురు గాక లోకులు హింస వలనఁ
దమకుఁ గలిగెడి నష్టంబు; దాని నెఱిఁగి
దయయె దమ మనోరాజ్యంబు నియతిఁజేయఁ
వఱలుదురు గాక నిర్వాణ ఫలముఁ గాంచి.

బుద్ధుఁడు—తథాస్తు.

(అందఱు నిష్క్రమింతురు.)

సంపూర్ణము.

---